## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఏ జీవిత గ్రంథమాల

# రామలింగ

రచన

పురసు బాలకృష్ణన్

అనువాదం

వాడ్రేవు పురుషోత్తం



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయసూచిక

# స్మృత్యంజలి

మరి రామలింగ ఇచటనుంటిరా ?<br>
ఇచట నివసించిరా<br>
వీధుల నడచిరా<br>
ఈ చోటు నేను నిలచియున్న<br>
మదరాసున, ఈ మదరాసున ?<br>
అది నిజమా ?<br>
వారు వ్యర్థముగా తిరిగే ప్రార్థించే<br>
కందస్వామి గుడిలో<br>
ఇపుడు అంగుడులు, జనములతో కిటకిటలాడుచు<br>
క్రిక్కిరిసె పండ్లు పడియుండు చాపలతో !<br>
అది నిజమా ?<br>
ఈశ్వేత పరిశుద్ధుడైన పరమాత్మ దివ్యతేజము<br>
వీరాసామి పిళ్లే వీధిలో వసియించె<br>
ఏడు నూతుల ప్రక్కగా<br>
మదరాసున, యీ మదరాసునందు,<br>
చిరకాలము తరుచు<br>
సుదూరము కాలినడకను వెళ్లిరి<br>
తిరువొత్తిరి యూరుకు<br>
ధ్యానించుట కొరకు ?<br>
ఓ, ఒక బుద్ధుడిచట నుండె<br>
నేను నిలచి యున్న చోటనే<br>
మదరాసునందు - కాదుకాశీలో !<br>
మరుదూరునుంచి - కాదు కపిల వస్తునుంచి !<br>
        దివ్యతేజోతనయుడు<br>
        తనయుడు కీర్తనమునకు !<br>
అని యనుకొనుటకది నిన్నటి దినమే -<br>
చెప్పడానికైతే -<br>
వంద సంవత్సరముల వెనుక<br>
వారుండిరిక్కడ,<br>
స్పందించు జ్యోతివలె<br>
భూమిపై నడయాడిరి<br>
ప్రతిచోటును వెలిగించెను<br>
దివ్యప్రభారోచిస్సులతో<br>
ఈనాడది భాసించుచున్నది !

# గమనిక, కృతజ్ఞతలు

సన్మార్గదేశికర్ (ఊరణ అడిగళ్) గారు తమిళంలో వ్రాసి 1871లో సమయపురం, వడలూర్‌లలో సమరస సన్మార్గ ఆరాచ్చి నిలయం వారు ముద్రించిన ఉద్గ్రంధం మహాత్మ రామలింగ జీవితం (రామలింగ అడిగల్ వరళరు) నుంచి యీ పుస్తకం వ్రాయడానికి ధారాళంగా విషయాన్ని గ్రహించాను. అందుకు వారికి నా కృతజ్ఞతలు.

రామలింగ రచనలలోని భాగాలను 1932లో 36 సామిపిళ్లే వీధి, చూలై, మద్రాసులో సమరస శుద్ధ సన్మార్గ సంఘం వారు అచ్చువేసిన తిరు అరుట్పా రెండు భాగాల నుంచి గ్రహించటమైనది.

తమిళం నుంచి అనువాదాలు నేను చేసినవే. సంస్కృతం నుంచి అనువాదాలు గ్రంధంలో అక్కడక్కడ పేర్కొన్న వారివి కాక తక్కిన వన్నీ నేను అనువదించినవే

పురసు బాలకృష్ణన్

# అధ్యాయం 1

## కాలము

దేశం రాజకీయ చైతన్య, సాంస్కృతిక పునరుజ్జీవన సంచలనాలలో కొట్టు మిట్టాడుతున్న సమయాన రామలింగస్వామి జన్మించారు. దక్షిణ భారతంలోని మరుదూర్ గ్రామంలో 1823వ సంవత్సరంలో జన్మించే నాటికి రాజారామ మోహనరాయ్‌కి 49 ఏళ్ల వయస్సు. అప్పటికే శ్రీ రాయ్ అత్యంత ప్రభావాన్వితులై ఉన్నారు. మరి ఐదేళ్ల తరువాత వీరే బ్రహ్మ సమాజం (స్పిరిచ్యుయల్ సొసైటీ) స్థాపించారు. ఈ సమాజ స్థాపకులలో రామమోహన రాయ్ తరువాత రెండవ వారైన దేవేంద్రనాథ్ ఠాకూర్ అప్పటికి ఆరు సంవత్సరముల బాలుడు. రామలింగస్వామి పరమపదించిన తరువాత 1875లో బొంబాయిలో ఆర్య సమాజం స్థాపించబడింది. దీని వ్యవస్థాపకులు దయానంద సరస్వతి, రామలింగ పుట్టిన మరుసటి సంవత్సరంలోనే జన్మించారు. 1867లో బొంబాయిలో ప్రార్థనా సమాజం స్థాపించబడింది. దీని ప్రధాన వ్యవస్థాపకులలో ఒకరైన మహాదేవ గోవిందరనడే జన్మించే నాటికి రామలింగ వయస్సు 19 సంవత్సరాలు. బెంగాల్ రాష్ట్రంలోని కమల్‌పుకుర్ గ్రామంలో రామకృష్ణ పరమహంస జన్మించే నాటికి రామలింగ వయస్సు పదమూడు సంవత్సరాలు. రామలింగ పరమ పదించిన ఒక సంవత్సరం తరువాత, అనగా 1875లో శ్రీమతి బ్లేవట్స్కీ, కొలనల్ వాల్‌కాట్ న్యూయార్క్ నగరంలో దివ్యజ్ఞాన సమాజం (థియొసాఫికల్ సొసైటీ) స్థాపించారు. వారు 1879లో బొంబాయి వచ్చారు. 1882లో మద్రాసు నగరం చేరుకున్నారు. రామలింగ జీవించిన ఏభై ఒక్క సంవత్సరాలలో మొదటి ముప్పై నాలుగు ఏళ్లూ గడిపిన మద్రాసు నగరంలో ఎట్టకేలకు దివ్యజ్ఞాన సమాజ ప్రధాన సంస్థ నెలకొనడం సమంజసం. దివ్యజ్ఞాన సమాజ స్థాపన ముందు ముందు జరుగనున్నదని వారు మరణించడానికి ముందుగానే జనవరి 1874లో రామలింగ భవిష్య వాణి చెప్పారు. 1865లోనే వీరు కడలూర్‌లో 'సమరస వేద సన్మార్గ సంఘం. (సొసైటీ

ఫర్ రిలిజస్ హార్మనీ ఇన్ యూనివర్శల్ సెల్ఫ్ హుడ్) స్థాపించారు. ఆ విధంగా చూసినా దివ్యజ్ఞాన సమాజం మద్రాసులో నెలకొల్పడం అత్యంత సముచితం. అన్ని మత బోధనలు, అన్ని మతాలతో సాన్నిహిత్యం, వాటికి సంబంధించిన పేర్లను, పూర్తిగా విడిచిపెట్టే ఉద్దేశ్యంతో 1872లో రామలింగ స్థాపించిన సంఘాన్ని 'సమరస శుద్ధ సన్మార్గ సత్య సంఘం'గా మార్చారు. దాని అర్థం (సొసైటీ ఫర్ ప్యూర్ ట్రూత్ ఇన్ యూనివర్శల్ సెల్ఫ్‌హుడ్). దీని ఆధార సూత్రాలన్నీ ఆ తరువాత పది సంవత్సరాలకు స్థాపించబడిన దివ్యజ్ఞాన సమాజం వారి ఆధార సూత్రాలే

కవి, ప్రవక్త అయిన రామలింగస్వామి గురించి వ్రాసేటప్పుడు వారి జీవిత విశేషాలను ఉగ్గడించడమే కాకుండా, హేతువాద జ్ఞానాన్ని విస్మరించకుండా వారి జీవిత విశేషాలు సాంప్రదాయికంగా ప్రచారంలో ఉన్న కథలు, గాధలు కూడా చర్చిస్తాను. ఒక విధంగా చూస్తే ప్రజలపై యీ కథలు గాధల ప్రభావం ఎక్కువగా వుంది ఆ ప్రభావం వల్ల వారు ప్రతిస్పందించడం జరుగుతుంది కాబట్టి మానవ జీవిత కావ్య రూపానికి ఈ కథలు, గాధలే ప్రతీకలుగా నిలుస్తాయి. అందుకే వీటికి కటువైన సత్యం కన్న, లేదా నగ్న సత్యం కంటె కూడా అధిక ప్రభావం వుంటుంది. విచిత్రం ఏమిటంటే, ఇలాటి గాధలే మానవ జీవిత విశేషాలకన్న బలంగా మనను పరిపూర్ణ మానవ స్వరూపానికి సమీపంగా తీసుకు వెళతాయి.

# అధ్యాయం 2

# జననం

దక్షిణ భారతదేశంలో నాట్య శివుని సుప్రసిద్ధ దేవాలయం వెలసిన చిదంబర నగరానికి పదిహేను కిలో మీటర్ల వాయవ్య దిశగా వున్న మరుదూర్ గ్రామంలో 1823 అక్టోబర్ 5వ తేదీన రామలింగ జన్మించారు. వారు శైవులు వెళ్లాల కులస్థులు. తండ్రి రామయ్య పిళ్లే ఆ గ్రామ లెక్కలు చూసేవారు, ఆయన ఉపాధ్యాయులు కూడా. వారి తల్లి చిన్నమ్మ మద్రాసుకు సమీపంగా వున్న చెంగల్పట్టు జిల్లాకు చెందిన పొన్నేరి పరిసరాలలోని చిన్న కవనం అనే గ్రామానికి చెందిన వారు. రామయ్య పిళ్లేకు వరుసగా ఐదుగురు భార్యలు గతించినప్పటికీ సంతానం కలుగలేదు. వారికి చిన్నమ్మ ఆరవ కళత్రం. ఆమె వల్ల రామయ్య పిళ్లేకు సభాపతి, పరశురామన్ అనే ఇద్దరు కుమారులు, ఉన్నములై, సుందరాంబాళ్ అనే ఇద్దరు కుమార్తెలు కలిగారు రామలింగ వారికి ఆరవ సంతానం మహాత్ములను గురించీ, ప్రవక్తలను గురించీ సర్వ సాధారణంగా మనం అనేక కథలూ, గాథలు వింటూ వుంటాము. అలాగనే ఇక్కడ కూడా ఒకసారి రామయ్య గారింటికి వచ్చిన ఒక శైవ సన్యాసి వారి జననం గురించీ, వారి మహత్తర భవిష్యద్ధర్మం గురించీ భవిష్యవాణి చెప్పారని ప్రతీతి. మహా శివుడే సన్యాసి వేషంలో వచ్చాడనీ, వారి యింటి నుంచి నాలుగడుగులు నడచి వెళ్లాక అంతర్ధానమయ్యారనీ కూడా చెప్పుకుంటారు.

రామలింగ ఆరుమాసాల శిశువుగా ఉన్నప్పుడే తండ్రి దివంగతులయ్యారు. తల్లి ఆమె స్వగ్రామమైన పొన్నేరికి తిరిగి వచ్చారు రామలింగ అయిదు మాసాల ప్రాయంలో ఉన్నప్పుడే అతని తండ్రి ఆ పసి బిడ్డను చిదంబరం తీసుకొని వెళ్లారనీ, ఆ పసివాడు, చిదంబరంలోని రహస్య మేమిటో అంతర్దృష్టితో చూశారనీ, చిదంబర దేవాలయంలో తెరవెనుకటి శూన్య ప్రదేశం నిరాకార దైవ స్వరూపానికి సంకేతమని గ్రహించారనీ చెపుతారు. ఈ రచయిత అంచనా ప్రకారం

చిదంబరం తీసుకువెళ్లే నాటికి రామలింగ వయసు సుమారు ఆరు మాసాలయి ఉండవచ్చు. తమ మొదటి అనుభవాన్ని ఒక కవితలో వర్ణించి చెపుతూ రామలింగ వారి తండ్రిని కాక తల్లిని పేర్కొన్నారు.

లేలేత వయస్సులో అపుడు మాయమ్మతో
నేను నీ చెంతకు చిదంబరము చేరాను
తెరను తొలగించి, ఆ వెనుక గల శూన్య
ప్రదేశాన్ని నగ్నమ్ముగా నేను చూశాను
ఆ చిదంబర రహస్యాన్ని నాకెరిగించి
ఓ దేవా ఆనంద రూపా మహాత్మా పరిపూర్ణతను ప్రసాదించితివి
పరిపక్వత పొడచూపు విత్తు, పండు పండేందుకు పూర్వమే.

# అధ్యాయం 3

## శైశవదశ

ఒక సంవత్సరం తిరగకుండానే అంటే 1824లో రామలింగ తల్లి మద్రాసులో ఉంటున్న పెద్ద కుమారుడు సభాపతి దగ్గరకు చేరారు. సభాపతి పేరుపొందిన పండితుడు. జీవనోపాధికి మత గోష్ఠులు జరుపుతూ ఉండేవారు. ప్రస్తుత మద్రాసు పోస్టల్ జోన్ 1కి చెందిన ఏడు నూతులు (Seven wells) దగ్గర వీరాసామి పిళ్లే వీధిలో వారు నివసిస్తూ వుండేవారు.

వారి చిన్ననాటి అనుభవాలను గురించి, తమ యిష్టదైవాన్ని ఉద్దేశించి కవి యీ విధంగా పునఃస్మరించుకున్నారు.

> దొరలు చూ తిన్నెపై నుంచి క్రింద పడుతున్నపుడు
> ఒక రాత్రి, వసారాలో నిద్రించుచున్నాను బాలునిగా
> మధ్యలోనే నీవునన్నాదు కున్నట్లనిపించె
> మృదువుగా నేలపై పరుండ బెట్టావు
> ప్రేమపూరిత హస్తములతో

రామలింగ అయిదేళ్ల ప్రాయంలోనే అన్నసభాపతి అతనికి చదువు చెప్పడం ప్రారంభించారు. కాని రామలింగ ఎప్పుడూ ఉదాసీనంగా ఉండేవారు. భావుకుడిగా, పరధ్యానంగా తిరుగుతూ కాలాన్ని గడిపేవాడు. సోమరిగా వీధుల్లో తిరుగుతూ సమీపంలోనే వున్న కందస్వామి ఆలయ ప్రాంగణంలో తచ్చాడుతూ పగలంతా గడిపేవాడు. తమ్ముణ్ణి యిక అదుపులో వుంచలేక కాంచీపురంలో ఉన్న తన గురువులైన సభాపతి ముదలియార్ అనే తమిళ పండితుని వద్ద చేర్చాడు ఆ పండితుడు కూడా రామలింగను ఏమి చేయలేకపోయాడు రామలింగ అప్పుడే తన పాటలతోను ప్రసంగాలతోను దేవాలయానికి విచ్చేసిన సభికులను ఆకర్షిస్తూ ఉండడం గమనించిన గురువుగారు తన బోధనలను యింక మానుకున్నారు.

తమ్మునితో విసిగి వేసారి పోయిన సభాపతి తమ్మునికి యింటి వద్ద అన్న వస్త్రాదులివ్వ వద్దని భార్య పార్వతిని గట్టిగా కట్టడి చేశారు. అయితే ఆయన విశ్రాంతి తీసుకుంటున్న సమయంలోనో, ఇంట్లోలేని సమయంలోనో రామలింగ మెల్లిగా పెరటి దారిన యింట ప్రవేశించేవాడు. వదినెగారు పార్వతి ప్రేమ పూర్వకంగా ఆ బాలునిచే అన్నం తినిపించేవారు. దయార్ద్ర హృదయంతో హితబోధ చేసి, అన్నగారి ఆదరణ తిరిగి పొందేలాగా చేయగలిగింది. తాను తప్పకుండా చదువుకుంటానని వాగ్దానం చేశాడు రామలింగ తన విద్యా వ్యాసంగం ఏకాంతంగా కొనసాగేందుకు అనువుగా మేడమీద తనకు ప్రత్యేకం ఒక గదిని కేటాయించవలసిందిగా కోరాడు రామలింగ. అతని కోర్కెనెరవేర్చింది వదినెగారు సోమరి పోతు రామలింగ ఇల్లు చేరుకున్నాడు. మళ్లీ ఇల్లు వదల్లేదు. మేడమీది గది నుంచి బయటకి రాలేదు. రోజంతా గదిలోనే తలుపు మూసుకొని వుండేవాడు తమ్ముని చూసి అన్నగారైన సభాపతి పిళ్లే చాలా సంతృప్తి చెందారు!

బహుశః ఇదే కాలంలో మానసిక పరివర్తన చెంది రామలింగ బాలసన్యాసిగా మారి వుంటారు. ఒక పద్యంలో దైవాన్ని ఉద్దేశించి రామలింగ యిలా అంటారు–

ఓ దేవా బాల్యంలో ఆడుకొనే సంవత్సరాలు –
నీకు తెలుసు, అయినా గుర్తు చేయ్యనీ నన్ను –
నేనొక దగ్గర బంధువు నడిగాను –
"నేనీ జగత్తును లెక్క చెయ్యను, మరి నువ్వు?"
అతను నాతో సమ్మతించాడు, వెన్ను చూపి
ఈ లోకానికి, తిరిగాము మేమిరువురము.
కాని నువ్వు దయార్ద్రతతో, మమ్ము వెనుకకు పిలిచావు
అందులకే, ఓ పరమాత్మా! నా మాతృదేవీ!
ఈనాడు నీకు నా కృతజ్ఞతలు.

ఈ పద్యంలో ఆ ప్రభువును తల్లిగా సంబోధించడం గమనించదగినది. అతనికి తల్లిగా వ్యవహరించి ప్రేమతో లాలనగా అన్నం పెట్టి, ఇంటికి తిరిగి వచ్చేలాగ అతనికి నయాన నచ్చ చెప్పింది వదినెగారు పార్వతి. ఆమె గురించే రామలింగ మనసులో ఆలోచిస్తూ ఉండి వుండవచ్చును. ఆయన తన శేష జీవితంలో ఆకలి సమస్యను గురించి అన్యమనస్కులై ఉండడానికి గల కారణం ఈ అనుభవం నించి అని మనం గ్రహించవచ్చును.

# అధ్యాయం 4

## బాల్యదశ

మూసిన తలుపుల వెనుక రోజుల తరబడి ఆ గదిలో రామలింగ ఏం చేస్తున్నాడో అన్నగారికి తెలియదు. రామలింగ ఇంటిపట్టున వున్నాడు. ఆయనకు అంతే చాలు. గోడకు చేర్చి ఒక అద్దం అమర్చాడు. ఆ అద్దానికి ఎదురుగా రామలింగ ఆచ్ఛాదన లేని దివ్వెనొకదానిని వుంచాడు. నూనెలో మండుతూన్న వత్తి. ఏకాగ్రతకు వీటిని సాధనాలుగా చేసుకొని ధ్యానమగ్నుడై వుండేవాడు. వడలూర్‌లో నలభై సంవత్సరాలు తరువాత స్థాపించిన 'శుద్ధ సన్మార్గ సత్యదేవాలయ' ప్రార్థనా మందిరంలోకూడా ఇవే సాదనాలను అమర్చారు. ఆ దివ్యజ్యోతి సార్వభౌతికాత్మకు, అద్దం మానవుని వ్యక్తీకరణకు ప్రతీకలుగా గుర్తించారు. సార్వభౌతికాత్మ తన అంతరంగంలో వెలుగొందేలాగున వ్యక్తి తన అంతరాత్మను అకళంకితమైన అద్దంలాగ ఉంచుకోవడానికి ప్రయత్నించాలి. ఆ విధంగా సార్వభౌతికాత్మను గురించిన అనుభూతి జనించింది. దానితో పాటే సార్వభౌతిక ప్రేమ, సర్వప్రాణులపై అనుకంప, జ్యోతి వలె వెలుగొంది వారి వారి మానసిక వికాసాన్ని బట్టి వివిధ స్థాయిలలో ప్రతిఫలిస్తూ వుంటుంది.

ఈ వయసు నుంచే రామలింగ పాటలు వ్రాయడం ప్రారంభించారు. లేదా, తన దైవంతో చెప్పుకున్నట్లు ఇంకా ముందుగానే ప్రారంభించి ఉండవచ్చును.

> దైహికంగా కొంచెమెదిగి, మానసికంగా మరింత తక్కువ పెరిగి
> చిన్ని పాదాలతో ఆటలాడుచు వీధిలో .
> నేను పాటలు కూర్చాను నన్ను పాడేలాగు చేశావు
> నిరాకారమునుంచి ఆకారము పొందితీవు ....

ఒక పద్యంలో వారే చెప్పినట్లు తొమ్మిదవ యేట అద్దంలో తనిహైమురుగస్వామి దర్శనం రామలింగనికి కలిగిందని చెపుతారు. ఎవ్వరూ నేర్పకుండానే ఆ గదిలోనే, అతను సమస్త జ్ఞానాన్నీ ఆకళింపు చేసుకున్నట్లు ద్యోతకమవుతుంది. అందుకొరకు చాలా పద్యాలలో రామలింగ భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు ఉదా :

నాలో వెలుగొందిన దేదీప్యమానమైన నీ కటాక్షము
శిక్షణ లేకనే నీ విడిన జ్ఞాన భిక్ష

ఆయన మొట్టమొదటి పాట పాడేటప్పటికి రామలింగకు తొమ్మిదేళ్లు కూడా నిండలేదు. పాట కందసామి దేవాలయంలోని షణ్ముఖుడు అంటే మురుగ్వ మీద పాడినది. అది వరుస క్రమమైన ముప్పై ఒక్క పద్యాల కూర్పు. అందులో యీ క్రింద పేర్కొన్న పాటను తమిళనాడులో యీ నాటికీ విస్తృతంగా పాడుతూ వుంటారు.

బంధించు నన్ను
　　నీలోవున్న ఉన్నతాత్మలతోడ
రక్షించునన్ను
　　మాటల మరుగున మరుగుపడు మనుజులనుంచి
ఉండనీ నన్ను
　　ఉల్లసిల్లుచు, నిత్యము నీస్తోత్ర గానము చేయుచు
దారి జూపుము నాకు
　　అనృతానికీ అహానికీ, ఆవలి దిక్కున
మార్గదర్శివికమ్మ నాకు
　　మతాలకు అతీతమైన అన్వేషణలో
తుడిచివేయుము నాలోని
　　కోరిక స్త్రీలపైని,
ప్రభూ, కందా
　　మద్రాసులో గుడి యందు ప్రతిష్ఠితుడవైతివి
　　దాతృత్వగుణమున్న నగరమది
　　నిన్ను మరువనీయకు నన్ను
　　దయాళువైన ఓ ప్రభూ, షణ్ముఖా,
అనుగ్రహింపుము
　　జ్ఞానము ఆరోగ్యము అనుకంప
　　సర్వదా నీలోనే యుండునట్లు

# అధ్యాయం 5

# తొమ్మిది నుంచి పన్నెండు వరకు

అదే సమయంలో అన్నగారు రామలింగని కూడ తన వృత్తి వ్యాసంగమున పాల్గొనమని ఒత్తిడి చేశారు. సాధారణంగా ఒక బాలిక తాళపత్రాలను చదువుతూంటే సభాపతి ఆ రచనకు వ్యాఖ్యానం చేస్తూ వుంటారు. ఒకనాడు ఆ బాలిక రాలేదు. అందుచేత రామలింగ ఉత్కృష్టమైన భావానా శైలితో చదివి శ్రోతల హృదయాలను ఆకట్టుకున్నారు. ఇకముందు కూడా అతనే చదవాలని శ్రోతల చేత అనిపించుకున్నాడు

ఒకనాడు సోము చెట్టియార్ అనే ధనికుని యింట సభాపతి ప్రసంగించవలసి యుండెను. కాని ఆ రోజు అతను జ్వర తీవ్రతతో బాధపడుతున్నాడు. ఈ విషయం వారికి తెలియ జేయడం కోసం రామలింగని ఆ ధనికుని యింటికి పంపించారు రామలింగ అక్కడికి చేరే సరికే సభికులు వచ్చి కూర్చున్నారు అందులో ఒకరు "అన్న గారికి బదులు రామలింగ ప్రసంగించ వచ్చును గదా" అని సలహా యిచ్చారు. రామలింగ ప్రసంగించాడు. ఆనాటి ప్రసంగ విషయం భక్తాగ్రేసురుడూ, వాగ్గేయకారుడూ అయిన తిరుజ్ఞాన సంబందర్‌ను గురించి! తిరుజ్ఞాన సంబందర్ (అంతర్జనిత జ్ఞాన సంపన్నుడు సంబందర్) ను తన ఆదర్శమూర్తిగా చేసుకున్నాడు రామలింగ తాళపత్ర రచనల తోడులేకుండా, ఉపన్యాసానికి కావలసిన సూచనలు లేకుండా, రామలింగ ప్రసంగించారు. ధారాప్రవాహంలాగ వారినోటి వెంట ఉపన్యాసం వెలువడింది మూసిన తలుపుల వెనుక గదిలోని ఒంటరితనాన్ని విడనాడి, బయటికి వచ్చి ప్రసంగించడం రామలింగనికి ఇదే మొదటిసారి అయినా రామలింగ తన శ్రోతలను సంపూర్ణంగా జయించేశారు ఫలితంగా తక్కిన ప్రసంగాలన్నిటినీ రామలింగస్వామివారే కొనసాగించాలని వారు కోరారు. అందుకు సభాపతి మనస్ఫూర్తిగా అంగీకరించారు. క్రొత్త శ్రోతల కోసం మరో చోటుకు వెళ్లారు.

రామలింగస్వామికి 1832 లో భగవత్కృపాకటాక్షం ప్రాప్తించినది. అప్పుడతని వయస్సు తొమ్మిదేళ్లు. ఈ విషయాన్ని వారే ఒక పద్యంలో చెప్పారు.

న్యాయ వితరణ సేతువు మానవుల, అవనరాలకు, పారితోషికములకు,

ఓ స్వయం ప్రభా భాసమాన కేంద్రీకృత కాంతి పుంజమగు
బ్రహ్మాండమా, నా జీవన మార్గదర్శీ
తొమ్మిదేండ్ల వయసుననే నన్నావహించి,
నీ సామ్రాజ్యమునకు దారి చూపి నాదిగా చేసి,
నీలో నాకేది కావలయునను
కోరికనే కోల్పోయితిని.

ఆ పర బ్రహ్మ స్వరూప సాన్నిహితత్వం అతనిలోని ఆధ్యాత్మిక వేదనలను పరిష్కరించలేదు. ఈ విషయం వారు తమ పన్నెండవ యేటనే గుర్తించారు.

నా దగు దైన్యస్థితి
పండ్రెండేండ్లాదిగ నేటివరకు,
ఓదేవా, సరిపోవును
కరగించుటకొక కొండను
ఈ దీనుని దైన్య
స్థితి ఓ దేవా!
రెండార్ల నుంచి యీ నాటికి
కరకు ఇనుమును కరగించబోవు.

తన ఇష్టదైవంతో మొరపెట్టుకొన్నట్లు, ఆతనికి ఆహారం తీసుకోవడం అంటే విముఖతే ఏర్పడింది.

పచ్చని పసి వయసు నుంచి,
తెలుపవలెనా నీతో,
నాలోనె యుండు ప్రభూ, కనుగొంటి నేను
తినుట కేవగింపు గలిగించు
నీ కరుణామృత పానము మాత్రమే
నే కాంక్షింతును.

ఇంకా యీ విధంగా అన్నారొక చోట.

మాయమ్మ కనుబొమలు ముడివడ చూసి భరియింప నోప
భుజియించితి విచ్చలవిడి కొన్నాళ్లు,
నన్నాదరించువారి నొప్పింప భయమొంది
నావారి బలవంతముపై తింటికొన్నాళ్లు.
లేకున్న స్వేచ్ఛగా భుజించాలంటే భయమేస్తుంది -
ఇది, ఓ ప్రభూ, నీకు తెలుసు.

తీయగా వున్నదని తిండి తింటి కొన్ని వేళల
వణకి పోతినేను, తీపి రుచి నెరిగి, ఒకవేళ
ఎపుడేని కొత్త కోరిక కెరయౌదునేమొ యనుచు
ఆ కారణాన, దేవా, నా తల్లీ, ఉపవసించితి స్వేచ్ఛగా
మిత్రులు ఆహార మివ్వక తప్పని సరియైనపుడు,
నేను నిన్నాశ్రయించితి, ఓ దేవా,
ఆహారము నాలో నిముడక బలము నీకుండ ప్రార్థించి
సేవించితి వారిచ్చినది
నేపొందిన యీ దేహము
దేవా, నాకు మక్కువలేదు దానిపై,
ఆకలి బాధతో తిన్నపుడు,
వెగటు కలిగించెనది నాకు -
ఇపుడైన వెగటె గలదు నాకు
తినుటకు
కోరికలేదు నాకు
నా దేహము ఎదుగవలెనని
చిక్కి నన్నిట్లే యుండనీ
నీకు తెలుసు, నీనుండి నేకోరేది ఇదియె అని.

ధనం అంటే వారికి ఆశలేదు. వారి ఉపన్యాసాలకు యిచ్చిన సొమ్ము వారు నూతులలోను, చెరువులలోను, ఒక్కొక్కసారి ఆ పైకము యిచ్చిన వారిపైన విసరివేసేవారు. ఈ విషయాన్ని కూడా వారు వారి పద్యాలలో చెప్పారు

నేనపేక్షించునది అనుకంప మాత్రమే – ధనమును
నేలక్ష్య పెట్టలేదు, యిప్పుడూ
ఎప్పుడూ, బాల్యము నుంచి కూడా.
ఇచ్చిన వారిపైననే తిరిగి దానిని విసరితిని
కొండకోనలలోనో, ఎక్కడనో పారవైచితి, నీకెరుక,
నాదైవమా నాలోనె యుండు,
నాకు వలసినదెల్ల
నీయనుకంప, అంతు లేకుండ.
ధనము ప్రియమైనదిగ నేనెంచను
నే గడియించిన సొమ్మును
పారవైచితి బావుల, కొలనుల, తటాకములలో
ప్రభూ నాతల్లీ, నే కూడ బెట్టున దెల్ల
నీవు బహూకరించు ధర్మములు, తరగిపోనివి,
తీసిపోనివి, ఇచ్చినను, గైకొనినను
నీ యనుగ్రహము యొక్క చోద్యము
నే చూచినది గాని చెప్పలేక పోవచ్చు

అతనికిచ్చిన సొమ్ము పారవైచుచున్నాడని తెలిసిన పోషకులు అటు తరువాత సొమ్ము అతనికి కాక, సోదరునికివ్వడం ప్రారంభించారు.

అదే విధంగా ఆ చిన్న వయస్సు నుంచే మతం, నమ్మకాలు లాటి బంధాలలో చిక్కుకోకుండా భగవంతుడు అంటే తేజోమయ పరిశుద్ధ జ్ఞానమేనన్న తన భావనకు రామలింగ కట్టుబడి వున్నారు. వారు స్థాపించిన ఫెలోషిప్ నుద్దేశించి యిచ్చిన ప్రకటనలో వారి చివరి దశలో యీ విధంగా అన్నారు.

ప్రభూ నన్నే విధముగా నీవు పసితనము నుంచి కపటములగు కులములు, కర్మకాండలు మొదలైన వాని నుంచి దూరముగా వుంచుచు, వాటి నిజస్వరూపము నెరిగించుచు నిలకడిగా కాలము గడచుచ్చుండ నాజ్ఞానమును వెలుగొంద చేయుచు నా అన్వేషణను మరింత శీఘ్రతరము గావించితివి.

## అధ్యాయం 6

# కీర్తనలు, మానవాతీత సంఘటనలు

రామలింగని పదవయేట ఆధ్యాత్మిక చింతనా సంఘర్షణ ప్రారంభమయింది మద్రాసుకు పది కిలోమీటర్లు ఉత్తరాన వున్న తిరువొత్తియూర్‌లోని దేవాలయాన్ని రామలింగ దర్శిస్తూ ఆ గుడిలో వెలసిన త్యాగరాజ (శివుని వైరాగ్యావస్థ) స్వామిని, దేవి వడివుడై అమ్మను ఆరాధిస్తూ ఉండేవాడు ఆ దేవాలయం ప్రాచీనమూ, ప్రసిద్ధమూ కూడా. నలుగురు శైవ ప్రవక్తలలోను ముగ్గురు తమ కీర్తనలతో స్తుతించారు వారు క్రీ శ. ఆరు, ఏడు శతాబ్దాలకు చెందన సంబందర్, అప్పర్, సుందరర్.

మద్రాసులో ఉన్న ఇరవై మూడు సంవత్సరాలూ, రామలింగ, నగరం నించి తప్పించుకొని రోజూ కాలి నడకను తిరువొత్తియూర్ వెళ్లి ఆ ఆలయంలోని త్యాగరాజస్వామి వారి మీద కీర్తనలు, పద్యాలు వ్రాస్తూ వుండేవారు. తరచు అలసిపోయి ఆరు బయట నిద్రిస్తూ అక్కడే రాత్రులు గడిపేవారు. తిరుత్తనిహై (మురుగన్ ఆలయం), తిరువలి డయం, తిరుముల్లైవయిల్ క్షేత్రాలు కూడా దర్శిస్తూండేవారు గమనించదగిన మరొక విశేషం ఏమిటంటే, వారు విష్ణు ఆలయాలైన తిరువళ్లూరు, తిరుకన్నమంగై కూడా దర్శించి ఆ దైవాలమీద కూడా చాలా పాటలు వ్రాశారు

అప్పట్లో తిరువొత్తియూర్ సముద్ర తీరాన వుండే ఒక మనోజ్ఞమైన ప్రదేశం. అక్కడ ఒక నంది దేవాలయం ఉండేది. ఇప్పుడది శిథిలమైపోయింది. ప్రక్కనే ఒక చిన్న యేరు కూడా వుండేది. ఇప్పుడు అదీ ఎండిపోయింది. ఈ నాటికీ చాలా ప్రచారంలో వున్న ఒక కీర్తనలో ఆ ప్రదేశాన్ని జ్ఞాపకం చేసుకున్నారు

ఓ తరువా, మండు వేసవి ఎెండ నుంచి ఉపశమన మిచ్చు విశ్రాంతి
ఓ చల్లని ఛాయా, ఓ నీడలో వున్న ఫలమా,
ఓ పరుగిడు స్వచ్ఛమైన సెలయేటి జలమా,

ఓ జల మాధుర్యమా, ఓ పుష్ప మధుర సుగంధమా,
ఓ తీరాన వీచు మారుతమా, మారుతపు మృదువైన స్పర్శమా,
ఓ ఎంతటి ఆనందము, నా ప్రభూ జగమును నడిపే వాడా,
నా నిజమగు నాధుడవు. నావిరి లోనె నన్ను వివాహమాడితివి,
కృప చూపి అను గ్రహింపుము దీని, నాపాటనే పూవుగా.

ఈ శ్రేష్ఠమైన కీర్తన గురించి విశేషముగా ఒక విషయం చెప్పుకోవాలి. భగవంతుని ఉద్దేశించి ప్రకృతిలోని ఒక అంశం తరువాత మరొకటి తారస్థాయి నందుకొని, భగవంతుని భర్తగా విషయాసక్త సంబంధమైన అంతర్ధ్వనితో కూడి పంచేంద్రియ జ్ఞానములతో మధురంగా వర్ణించబడింది. ఈ రచన రాబర్ట్ బ్రౌన్ రచించిన 'సౌల్', అనే పద్య సంపుటిలోని 'వైల్డు జాయ్ ఆఫ్ లివింగ్' ను గుర్తు చేస్తుంది. బ్రౌన్ కవితకూ, రామలింగ కవితకూ గల ముఖ్యమైన తేడా రామలింగవి ఆధ్యాత్మిక చింతనతో కూడిన మాధుర్యం. బ్రౌనింగ్ కవితలో వున్న ఇంద్రియలాల సత్వపు బంధాలే వీరామ లింగరచనలోలేవు.

రామలింగకు ఈ తరుణంలోనే కొన్ని గుప్తమైన అనుభవాలు కలిగాయనీ, భగవంతునితో సంసర్గం ఏర్పడిందనీ కూడా చెప్పుతారు. ఈ విషయాన్ని తమ సహజమైన రీతిలో మనసు ద్రవించేలాగా వారు చెపుతారు ఒకరోజు రాత్రి తిరువత్తియూరు నుంచి అన్నగారి యింటికి తిరిగి వచ్చే సరికి చాలా పొద్దు పోయింది. నిద్రపోతున్న అన్నగారిని, వదినెగారిని లేపడం వారికి ఇష్టంలేదు. రాత్రి భోజనం చెయ్యలేదు, ఆకలిగా వుంది, అలసి పోయి వున్నాడు ఇంటి అరుగు మీద పడుకున్నాడు నిద్రపోవడానికి. అంతలోగా ఎవరో లేపారు. అతని ప్రక్క అన్నం పళ్లెం పట్టుకొని వదినెగారున్నారు. రామలింగ అన్నంతిని తిరిగి నిద్రకుపక్రమించారు. కొంచెం సేపటికి మళ్లీ మేలుకొలిపారు అతన్ని. అతని వదినెగారు లోపలికి వచ్చి భోజనం చెయ్యమని పిలిచారు. తరువాత చెప్పిన వివరాలను బట్టి మొదటిసారి మేల్కొల్పినప్పుడు అది స్వప్నదర్శనమని భగవతి వడివుడై య్యమ్మ ఇత్తడి కంచం చేత పట్టుకొని రెండవసారి దర్శనం యిచ్చిన వెనుక అది రూఢియైనది ఈ దృశ్యం వారిముందు మెరిసి మాయమయింది. రామలింగ ఒకపద్యంలో దీనిని గురించి చెప్పారు. అందులో!

ఆ రేయి పంచపాళిలోనే పడివున్నపుడు, చలితో
అలసి, ఆకలితో వుంటిని, తల్లీ జీవికి నీవు మధురమగు ఆధారమవు
నా చెంత చేరి, నన్నడిగితివి, "ఒత్తియూర్[1] నుంచి తిరిగి వచ్చి
అలసితివా?" అని
నీ అద్భుతమగు మహిమ, పావనమగు పళ్లెములో
నీ శుభప్రదమగు హస్తముతో, నన్నాశీర్వదించితివి
పరమానంద భరిత భక్ష్యములతో, ఓ తల్లీ నీవు గ్రహించితివి
నా బాధలు నీ బాధలుగానే, ఓ నటరాజా[2]
అందుకొనుము నా తడబడు యీ స్తోత్రము

మరొకసారి ఆలయంలోని స్వామి త్యాగరాజు స్వయంగా వీరికి ఆహారము ఇచ్చారట. తరచు జరుగుతున్నట్లే ఒకరోజు రామలింగ దేవాలయ ప్రాంగణంలో నిదురపోతూవుండగా పూజారి వచ్చి ఆతనిని మేల్కొల్పి ఆహారం ఇచ్చారట. పూజారి రెండు రోజులకు పూర్వమే తిరువొత్తియూర్ వదలి వెళ్లారని మరునాటి ఉదయంగాని తెలియలేదు

వారి జీవితంలో తరుచు జరుగుతున్నట్లే, ఈ సమయంలో కూడా అనేక అద్భుతాలు వారు ప్రదర్శించినట్లు నమోదు చేయబడింది. అందులో యిక్కడ ఒక దాన్నిగురించి చెప్పుకుందాం. పట్టినత్తర్ దేవాలయం తిరువొత్తియూర్‌లో వుంది. అక్కడివారు పూజలు చేస్తుండేవారు. ఒకరోజు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో దేవాలయ సేవలో తన చివరి రోజులు గడుపుతూ వున్న ఒక ముదుసలి స్త్రీ వారిని ఏదన్నా అద్భుతం చేసి చూపి తన భక్తి విశ్వాసాలను దృఢంగా ఉండేటట్లు చేయమని ప్రార్థించింది. రామలింగ సముద్రపు ఇసుకను పిడికిట తీసి ఆమెచేతిలో వుంచాడు. ఆమెను పిడికిలి మూసి తిరిగి తెరువమన్నాడు. ఆమె అట్లు చేయగా ఇసుకకు మారుగా ఆమె చేతిలో చిన్న చిన్న శివ లింగములు

---

1 'ఒత్తియూర్' అన్నది తిరువొత్తియూర్ న్న పేరులో 'తిరు' అనగా పవిత్రం అన్న మాట వదలి వాడినది.

2 భగవంతుని తల్లీ అని ఒకచోట, నటరాజ అని మరియొక చోట సంబోధించటం వలన ఆశ్చర్యపడవలసిన పనిలేదు హైందవ సంప్రదాయానుసారం ఆ పరమాత్మను అన్ని సంబంధార్థకమైన సంబోధనలతోను, సందర్భానుసారంగా, లేదా తమకు తోచిన విధంగా పిలువడం సాంప్రదాయమే!

కనబడ్డాయి. క్రీ. శ. పదకొండవ శతాబ్దానికి చెందిన గొప్ప శైవభక్తుడు పట్టినాధర్ తిరువొత్తి యూర్‌లోనే శివ లింగంలో లీన మయ్యారన్నగాధ యిక్కడ గుర్తు వస్తుంది.

ఎవరో ముఖ్య శిష్యులు వచ్చి దయ చూపమన్న ప్రత్యేక సందర్భాలలో తప్ప రామలింగ అద్భుతాలను చెయ్యడానికి నిరాకరించేవారు. ఎందుకంటే అలాంటి అల్ప కృత్యాల వల్ల నిజమైన ఆధ్యాత్మిక సంపదకు నష్టం వాటిల్లుతుంది.

భగవదనుగ్రహం వల్లా అద్భుత కార్యాలు చేయడం వల్లా, రామలింగ కీర్తి అతివేగంగా వ్యాపించింది వారి స్వచ్ఛత, నిష్కపటత్వం, నమ్రత, వాక్పటిమ, చాలా మంది ప్రముఖులతోసహా సామాన్య ప్రజలను కూడా ఆకర్షించాయి. వారిలో ముఖ్యులు 1849లో వారి శిష్యులుగా మారిన వేలాయుధ ముదలియార్. రామలింగ దివంగతులైన పిమ్మట వీరు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తమిళ పండితులయ్యారు తరువాత వీరు మరి కొందరు శిష్యులు చేరి గురువుగారి రచనలు సేకరించి ప్రచురించారు

# అధ్యాయం 7

# వివాహం

బుద్ధుడు (క్రీ.పూ.568 - 488), రామకృష్ణ (క్రీ.శ.1836 - 1886), రమణ మహర్షి (క్రీ.శ.1879 - 1950) వీరి వలెనే రామలింగ జీవన్ముక్తుడయ్యాడు. పుట్టిన నాటి నుంచీ అతనికి ప్రాపంచిక సుఖాలపైన, ఐశ్వర్యముపైన, స్త్రీలపైన కోరికలు లేవు. ఒక పద్యంలో తన దైవంతో యిలా చెప్పుకుంటారు రామలింగ.

మరల నన్ను ఉచ్చులో బంధింపనెంచితివా
మగువ బాహువుల బంధింప, తెలుపనీ నన్నేంటనే
పాలు త్రాగు నాటి నుంచి విముఖడ దీనినుంచి
ఇంకను తెలుపవలెనా? అందుకొరకు, నీకే,
ప్రాణకోటి ప్రజ్వలిత హృదయకుంజముల నర్తించు
నా ప్రభూ, నేను నీ కంకిత మైనాడను.

చుట్టాలు, మిత్రులు, అతని వివాహం చేయడానికి ప్రయత్నాలు చేశారు. అయినా రామలింగ తమ అనుమతిని ఇయ్యలేదు. వారిని ఒప్పించడానికి ఒక సన్యాసి సహాయం కూడా అర్థించారట. వారి కోరికపై జీవితంలో వ్యక్తి కర్తవ్యాలు, గృహస్థుగా సామాజిక ధర్మనిర్వహణల గురించి రామలింగతో మాట్లాడారు. చివరికి రామలింగ అంగీకరించారు 1850లో ఇరవై ఏడవ యేట వారికి వివాహమైనట్లు తెలుస్తున్నది. ఆ రోజుల్లో వివాహం చేసుకోవడానికి అది చాలా ఆలస్యమే. ఈ వివాహం జరిగిన తేదీ వివరాలకు ప్రామాణికమైన ఆధారాలు లేవు. వధువు రామలింగ అక్కగారైన ఉన్నములై అమ్మ కుమార్తె ధనమ్మాళ్. వివాహం జరిగే సమయానికి ఆమె వయసు ఎంతో తెలియదు వివాహం జరిగింది అసలు వివాహానికి వారు ఎందుకు అంగీకరించారో తెలుసుకుంటే మరింత ఆశ్చర్యం కలుగుతుంది. తన తల్లి కనుబొమలు వన్నె తరగినవి చూసి చింత పొందితిని - అని చాలా పద్యాలలో వారు చెప్పడం బహుశా యీ విషయం గురించి

ప్రస్తావించడమేనేమో! వివాహ విధులకనుగుణంగా, మంగళ సూత్రాలను గురుతుగా వధువు మెడలో వారు కట్టారు. గర్భాదానం నాటి రాత్రి, మాణిక్య వాచకర్ తిరువాచకం చదువుకుంటూ ఆమెతో గడిపారు. కంపించే తరువాత రాత్రులు కూడా ఇలాగే గడిచాయి. గొంతుతో 'పిళ్లెయ్ పెరు విన్నపం' సుతుని విన్నపం అను పద్యంలో బ్రహ్మచర్యాన్ని గూర్చి చెపుతూ తన తప్పిదాన్ని ఒప్పుకున్నారు రామలింగ.

> అది నా వెనుకటి కర్మ మానను వెంటాడు నది?
> అది నీ కృపాదృష్టి యానన్ను రక్షించునది?
> కోరిక నేనెరుగనిది, ఐనను ఒక ముదితను
> నేను తాకితిని – మాకరములు కలిసె, శిరసువంచెనామె
> నే నామెను తాకితిని, కాని సంయోగము
> జరుగలేదు. నీ కెరుక, నా తండ్రీ,
> అవమానముతో క్రుంగి కుంచించుకు పోతిని
> ఇది నేను తిరిగి తలంపగ

మాణిక్య వాచకర్‌ను ప్రస్తుతిస్తూ వారు యిలా అన్నారు.

> వెలుగొందు ఆత్మ పరమాత్మలో లీనమై
> మధురము, మధురము, నా పాటలో మిళితమైనట్లు
> నే పాడెద, ఇంద్రియములనణచుకొని, ఆత్మ విలీనము చేసి
> మధురము, మధురము, నీ పాట చెఱకు రసమువోలె,
> నూత్నమై తేనె లొలుకు, పండ్ల రసముతో కలిపి
> మరి క్షీరముతో, వెక్కసముగాకుండ, అతి మధురము

తనను ఆ పరమాత్మతో ఐక్యం పొందించడానికి మాణిక్యవాచకర్ వారి 'శుభప్రదమైన వాక్కులు' చాలును అంటారు ఇంకొక పద్యంలో

ఈ సందిగ్ధావస్థ తరువాత వారి జీవితంలో ధనమ్మాళ్ ప్రసక్తి యెప్పుడూ రాలేదు. ఆమె తరువాతి జీవితాన్ని గురించిన వివరాలు కూడా తెలియవు.

# అధ్యాయం 8

# సంపాదకుడు, పరిశోధకుడు, కవి

రామలింగ మద్రాసులో ఉన్న కాలం సాహిత్య కార్యకలాపాలతో నిండిఉండేది. పద్యాలు, కీర్తనలు వారి కలం నుంచి ప్రవాహంలాగ వెల్లి విరిశాయి. మొదటి పన్నెండు సంవత్సరాలు, అంటే 1835 వరకూ 'కంద కొట్టయుగం' అని వారు వర్ణిస్తూ వుండేవారు. 'కొట్టం' అంటే దేవాలయం అని అర్థం. ఆ స్వామితో తాదాత్మ్యం చెంది, భక్తునిగా, కందస్వామి మీద అనేక కీర్తనలను వారు రచించారు. తరువాతి ఇరవై రెండు సంవత్సరాల కాలాన్నీ 'తిరువొత్తియూర్ యుగం'గా చెప్పవచ్చు. ఆ కాలంలో శివుని వైరాగ్య అవస్థకు ప్రతిరూపమైన త్యాగరాజస్వామి భక్తుడై అతనితో తాదాత్మ్యత పొంది, త్యాగరాజస్వామి మీద చాలా కీర్తనలు వ్రాశారు. చాలామంది శిష్యులు, మతాధిపతులు, పీఠాధిపతులు, సంస్కృత, తమిళ పండితులు, గ్రామ, నగర పెద్దలు, ప్రభుత్వోద్యోగులు, విద్యాగంధంలేని వారు కూడ రామలింగని యోగ విద్యాపారంగతునిగా, ఆధ్యాత్మిక గురువుగా, కవిగా, పండితునిగా, వారిని పూజించుతూ ఉండేవారు.

అదే కాలంలో అంతకు ముందు తరానికి చెందిన కొన్ని పద్యాలను సవరించారు. రెండు వచన గ్రంధాలను కూడా వ్రాశారు.

అందులో మొదటిది "ఒఝివిల్ ఒడుక్కం' (ఆత్మ జ్ఞానబోధిని). దీనిని తిరుప్పొరూర్ చిదంబరస్వామి వారి వ్యాఖ్యాన సహితంగా స్వామి కన్నుడయవల్లాల్ (క్రీ.శ.1380 - 1476) రచించారు; 1851లో సభాపతి ముదలియార్ దీనిని అచ్చువేశారు

సభాపతి ముదలియార్ కోరికపైన తరువాత ప్రచురించిన గ్రంథం, సెక్కిజర్‌వారి ప్రాచీన తమిళ పురాణ గ్రంథం (పెరియ పురాణం) లో చెప్పబడిన రాజామనుచ్చోళన్. ఒక ఆవుకు న్యాయం చేకూర్చిన కధను రామలింగ వచనంలో విస్తృతంగా చెప్పారు. మత బోధనా సంస్థవారి కోసం 1854లో యీ పుస్తకం పాలయం సుబ్బరాయ చెట్టియార్ ముద్రించారు.

ఇదే కాలంలో మద్రాసులో పండితులు, ఉపాధ్యాయులు, విద్యా పోషకులు, వీరందరికీ మధ్య ఒక చిన్న విద్యావిషయమైన చర్చ జరిగింది. సమీపంలో వున్న చెంగల్పట్టు, ఉత్తరార్కాటు జిల్లాలు, దక్షిణ ఆర్కాటు జిల్లాలోని కొంత భాగంతో కూడిన యీ ప్ర దేశమంతా ప్రాచీన కాలంలో ఒక రాజ్యానికి చెందినదే. ఆ ప్రాంతం పేరు 'తొండై మండల'మా 'లేక తొండమండలమా' అన్నది చర్చనీయాంశం. అందులో కొంతమంది తమ అభిప్రాయం చెప్పమని రామలింగ వద్దకు వెళ్లారు. తమ అద్భుత వ్యాఖ్యాన, విశ్లేషణలతో ఆ విషయాన్ని పరిపూర్ణంగా చెప్పారు వెంటనే అక్కడ వున్న తొండ మండలం తళువ వేలాలర్ సంస్థ ప్రధానాధ్యాపకులు, పండితుడు అయిన అయ్యసామి ముదలియార్ దాన్ని పుస్తక రూపంలో ప్రచురించడానికి అనుమతించవలసినదిగా వారిని కోరారు దీని ఫలితంగానే కీ.శ. 18వ శతాబ్దికి చెందిన కవి పదిక్కాశర తొండమండలంపై వ్రాసిన తొండమండల శతకం రామలింగస్వామి వారు ప్రచురించారు ఉపోద్ఘాతంలో తొండమండలం గురించిన నామ వివరణ కూడా యిచ్చారు అయ్యాసామి మొదలియార్ దీనిని 1855లో ప్రచురించారు. ఈ ప్రచురణ ఉచితంగా పంచిపెట్టడానికే అన్నది గమనించ తగిన విషయం ఏ విద్యావేత్త అయినా కోరుకొనే విధంగా, యుక్తి యుక్తంగా ఖచ్చితంగా రామలింగ 'తొండమండలం' అన్న పేరును శాసన పరిశోధకుల స్థాయికి తగిన విధంగా స్థిరపరిచారు. వారు తన వ్యాసాన్ని యిలా ముగించారు.

> ఇంకానమ్మకం కుదరని వారెవరైనా వుంటే రాజా ఆ తొండ నిర్మించిన
> దేవాలయాలలోని శిలాశాసనాల వైపు దృష్టి సారించవలసినదిగా
> మనవి చేస్తున్నాను. ఆ శిలాశాసనాలన్నిటిలోనూ ఆ తొండ అనియే
> చెక్కబడి ఉన్నది తిరువలిడయం, తిరుముల్లైవయిల్ మొదలైన దేవా
> లయాలలోని శాసనాలు పరిశీలించి సంతృప్తి పొందవచ్చు

మరొక విషయం ఇక్కడ చెప్పవలసి ఉన్నది. ఈ స్థలాలలో ఉన్న శిలా శాసనాలలో యీ ప్రాంతాన్ని 'తొండ మండలం' గానే పేర్కొన్నారు.

రామలింగ సంపాదకత్వంలో వెలువడిన మూడవ పుస్తకం వృద్ధా చలవాసి అయిన ముత్తయస్వామి వారి చిన్మయ దీపిక (గైడ్ టు స్పిరిచ్యుయాలిటీ) దీనిని 1857లో మధురై ముదలియార్ ప్రచురించారు. రామలింగ రచించిన రెండవ వచన గ్రంధం జీవకారుణ్య ఒజుక్కం (జీవకారుణ్యనీతి) వారి మరణానంతరమే అది ప్రచురించబడింది.

రామలింగకు తమ పద్యాలను ప్రచురించాలన్న కుతూహలంలేదు. వారు అందుకోసం ఏ విధమైన ప్రయత్నమూ చెయ్యలేదు. మద్రాసులో ఉన్న కాలంలోనే వారి నుంచి వెలువడిన భక్తి, తత్వవిచార సంబంధమైన పద్యాలు అక్కడక్కడ కొన్ని వారి శిష్యుల ద్వారా ప్రచురించబడ్డాయి. వారు మద్రాసు వదలి వడలూరు చేరిన చాలా సంవత్సరాల తరువాత పట్టుదలతో వున్న కొద్ది మంది శిష్యులు వారిని ఒప్పించారు. వారి పద్యాలను ఒక రూఢి అయిన సంపుటిగా ప్రచురించడానికి ఈ పుస్తకానికి 'తిరుఅరుట్పా' (హోలీ బుక్ ఆఫ్ గ్రేస్). అయితే యింకా చాలా పద్యాలు ఈ సంపుటిలోకి రాకుండా మిగిలిపోయాయి.

# అధ్యాయం 9

# చిదంబరానికి పయనం

మదరాసులో వారికి గౌరవాదరాలు లభిస్తున్నప్పటికీ రామలింగ పగలంతా నగరానికి వెలుపలే గడిపేవారు. రాత్రి పొద్దు పోయాక మాత్రమే ఇంటికి తిరిగి వచ్చేవారు. మద్రాసు వదలి వెళ్లిన చాలా కాలం తరువాత వ్రాసిన ఒక పద్యంలో వారిలా అన్నారు.

నే భయమందితి మదరాసు నగరమందలి ధనము చూసి
నే భయమందితి ఆకలిమి నన్ను కొంచెపరచునేమో యని
నీ కెరుక, నా తండ్రీ,
అలసట నిండిన నా త్రిప్పటలు పోలాలలో
పల్లెలలో నగరముల వెలుపల
కంకర, రాళ్లతో నిండిన రోడ్లపై
కాలుగాలు నేలపైనా సంచారములు నీకెరుకయే మాటలలో
నింపతరమె రోజంతటి నా అలసట?

పుట్టిన మొదటి రెండు సంవత్సరాలే కాక ముప్పై మూడు సంవత్సరాల జీవితం మద్రాసులో నే గడిపి 1858లో తమ ముప్పై ఐదవ ఏట మద్రాసు నగరం వదలి వెళ్లారు. అదీ ఒక విధంగా మంచికే జరిగింది. చిదంబరాన్ని గురించిన దివ్యస్మృతి ఆయన మనసులో మెదలుతూనే వుంది  కొద్ది మంది అనుచరులను, శిష్యులను వెంట తీసుకొని కాలినడకను, చిదంబరానికి ప్రయాణమయ్యారు రామలింగ. మరుదూర్‌లో జన్మించి, వరుసగా మదరాసు, కరుంగుజి, వడలూరు, మెట్టు క్కుప్పంలలో నివసించి చిదంబర పుణ్యక్షేత్రానికి తమ నామాన్ని అంకితం చేసుకొని 'చిదంబర రామలింగం' అని తమ పేరు చెప్పుకొనేవారాయన.

చిదంబరానికి పయనమవుతూ మార్గంలో శీర్కాజీవంటి క్షేత్రాలు దర్శించుకుంటూ వెళ్లారు. చిన్నప్పటి నుంచీ తన ఆధ్యాత్మిక గురువుగా ఎంచుకున్న గొప్ప శైవభక్తులు తిరుజ్ఞాన సంబంధర్ జన్మస్థానం శీర్కాజి ఆ

గుడిలో తమ ఉపన్యాసాలు యిచ్చారు. ఆ దైవం మీద పాటలు వ్రాశారు తరువాత వైదీశ్వరర్ కోవెల దర్శించి అక్కడ కూడా పాటలు, స్తోత్రాలు వ్రాసి, చివరకు తమ స్వగ్రామమైన మరుదూర్‌కు సమీపంలో వున్న కరుంగుజి చేరుకున్నారు. రామలింగ అక్కడికి చేరుకున్న కొద్దిరోజులకు వారి అన్నగారు పరశురాంపిళ్లే మరణించారు. రామలింగ చిదంబరం వెళ్లేందుకు సిద్ధం అవుతూన్న సమయంలో అక్కడి గ్రామ రెవెన్యూ అధికారి వెంకటరెడ్డియార్ తమ యింటిలో ఉండమని అర్థించారు. రామలింగ అంగీకరించారు. వారికి ప్రత్యేకంగా ఒక గది వెంకటరెడ్డియార్, అతని భార్య ముత్యాలు అమ్మాళ్ వారి అనుష్టా అవసరాలను భక్తిశ్రద్ధలతో చూశారు. ఆ విధంగా తొమ్మిది సంవత్సరాల పాటు; 1867లో కరుంగుజికి వెళ్లే వరకూ రామలింగ అక్కడే వున్నారు.

మద్రాసులో వలెనే, రాత్రులు మాత్రమే రామలింగ ఇంటివద్ద గడుపుతూ, పగటి సమయమంతా తమ దైవంతో నడుస్తూ దేవాలయాలలో పూజలు చేస్తూ పాటలు వ్రాస్తూ కాలం గడిపేవారు ఇక్కడ వారి రోజూ పర్యటన నటరాజస్వామి దేవాలయ స్థానమైన చిదంబరానికి తమిళంలో చిదంబరంను తిల్లై అంటారు. ఇది అతి ప్రాచీనమైన దేవాలయం అందుకే క్రీ శ ఏడవ శతాబ్దికి చెందిన మాణిక్యవాచకర్ చిదంబరం గురించి చెబుతూ 'ప్రాచీనతిల్లై' అంటారు భారతీయ పురాణేతిహాసాలలో గుర్తించిన పంచ భూతాలకు, అంటే భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము వీటిని తెలిపే చిహ్నాలుగా తమిళనాడులో ఉన్న అయిదు దేవాలయాలలోనూ చిదంబరం పరమ శివుని ఆకాశ రూపానికి దర్శనం ఆ పరమేశ్వరుని అతి సూక్ష్మ సాక్షాత్కార రూపం ఇది.

స్పష్టంగా గోచరించే పరస్పర విరుద్ధమైన ఒక (ఇది ముఖ్యంగా హిందువులు కాని వారి మనసులకు తోచవచ్చును) సందేహాన్ని యిక్కడ వివరించి నివృత్తి చెయ్యాలి. వారి గురించి ప్రచారంలో ఉన్న ఒక ఉదంతం ప్రకారం రామలింగకు అతి బాల్యంనందే చిదంబరంలో పరమశివుని కటాక్షం కలిగినది. చిన్నతనంలోనే మురుగస్వామి, లేక కందన్ లేక షణ్ముఖ లేక సుబ్రహ్మణ్యస్వామి కృపా,మద్రాసులోని కందస్వామి కటాక్షం కలిగాయి వారి యింటిలో ధ్యానం నిమిత్తం ఉంచుకొనిన అద్దంలో తన్నిహై గుడిలోని మురుగన్ దర్శనం చాలాసార్లు లభించింది. తరువాత వారు చిదంబరంలోని శివుని పూజలకు మరలినారు. ఈ అందరి దేవతామూర్తుల

గురించీ వారు కీర్తనలు రచించారు. విద్యావంతులైన, విద్యలేని వారైన వారి అనుయాయులు, శిష్యులు, మొదలైనవారికి ఈ విషయాలు పరస్పర విరుద్ధాలుగాగాని, అసంగతాలుగాగాని, సమస్యాత్మకమైనవిగాగాని తోచలేదు చదువులేకపోయినా, బోధనలేక పోయినా, తన మనస్సులో సహజంగా ఉండే ఒక అవగాహనతో 'భగవంతుడు ఒక్కడే, ఏ రూపంలోనైనా, ఏ ఆకారంలో నైనా, నిరాకారునిగానైనా దరిచేరవచ్చును' అన్న హిందూ మతంలోని ప్రాధమిక పూర్వ సిద్ధాంతాన్ని ప్రతి హిందువూ నమ్ముతారు తమిళ సిద్ధులు "ఏ భగవంతుని పూజించినా, ఆ రూపంలోనే పరమశివుడు నీకు ప్రత్యక్షమవుతాడు." అని చెప్పారు భగవద్గీతలో కూడా శ్రీకృష్ణపరమాత్మ "ఏ రూపంలోనైతే భక్తుడు తన దేవుని భావించి పూజిస్తాడో, అతని నమ్మకాన్ని ఆ రూపంలోనే నిజమని నిరూపింతును" అంటారు (VII-21).

కరుంగుజిలో వున్న కాలంలో వృద్ధాచలం, తిరువణ్ణామలై, తిరువడిహై క్షేత్రాలు దర్శిస్తూ అక్కడి దైవాలను పూజిస్తూ వుండేవారు, వారిని స్తుతిస్తూ కీర్తనలు వ్రాశారు. కాని కరుంగుజికి అతి సమీపంలో ఉండడంవల్ల చిదంబరానికి రోజూ వెళ్లి పూజలు చేస్తూ వుండేవారు.

చిదంబరంలో నటరాజస్వామి (శివుడు) సన్నిధిని యీ విధంగా అన్నారు.

అలనాటి నీ యనుగ్రహమును గుర్తు చేసుకొంటిని
నే పసి వానిగ నుండ, గుర్తు చేసుకొనుచు మంత్రముగ్ధుడ నై నిలచితిని
దూరాన, కన్నీళ్లు కార్చుచు, అచ్చెరు వందుచు ఏ సత్కార్యములు
నే చేసినవి నాకీవరము దెచ్చినవి, యీ నీ సంకల్పము
నాలోని, నీ పిలుపు వచ్చునను వాగ్దానము
దాని రాకకై తాళిమిలేక, నే చెప్పబోతిని
'ఆ రోజు వచ్చినది - అది యీ రోజే, నన్ను
నీ వానిగా ఇప్పుడు చేసికొనుము, ప్రభూనే పలుకునంత లోనీవే పలికితివి

చిదంబరం దైవ సాక్షాత్కారం ప్రాప్తించినట్లు వారు రూఢిగా చెపుతున్నారు

దేవా. నా ప్రభువా తిల్లైయిలో నాతో మాట్లాడితివి

నీ మందిరములో రహస్యము నీయెదుట నిలచినపుడు,
నాతోననుచు "ఇక నుంచి మాయనుగ్రహము నీదగు,
ఆనాడు మాట యిచ్చినట్లు; నిశ్చింతుడవు కమ్ము.
ఇక నుంచి అన్ని శక్తులు నీవే, మాయనుగ్రహము నుంచి ఉదయించు
దానికి సమమగు, వలసిన రీతి నీ దేహము నెంచుకో,
అణురూపమా, హేత్వర్థకమా, నిరాకారమా సంతోషముగ జీవించుము
మేము నీలో జొచ్చితిమి, అట్లే యుందు మిక."
అట్లాశీర్వదించుచు, మోక్షదాయీ ప్రభూ, నీవు చూపించితివి
నీ తేజస్సు, నేనందు వలన పెరుగుటకు.

వారు నటరాజస్వామి పైన పాడిన పాటలు అసంఖ్యాకములు అవి చాలా వైవిధ్యంతో కూడి ఉన్నాయి. అంచేత వాటి నుంచి ఉదాహరణకు ఏ ఒక్కటీ ఎంచుకోవడం అన్నా చాలా కష్టం. ఇక్కడ ఉదహరించిన కీర్తన యీ నాటికీ బహుళ ప్రచారంలో వున్నది.

నటరాజు నాట్యము చేయు సర్వజనుల బ్రహ్మానందమునకు
విజ్ఞుల, అవిజ్ఞుల, కు ఉల్లాసము కలుగు,
తాపసుల, అంధుల దర్శనము,
బలవంతుల, బలహీనుల ప్రాపు.
ఓ, అపేక్షకునికి, కరుణామూర్తికి జ్ఞానము,
మంచి చెడుల మధ్య వున్న ఆ అనుభవము,
దైవత్వమును, దానవత్వమును, పంచి పెట్టువాడవు,
నాయీ పాట యను పూలమాలనుగైకొని కృపచూపుము.

## అధ్యాయం 10

# సర్వమానవ సౌభ్రాతృత్వ సంఘం

రామలింగ ఆధ్యాత్మిక ఔన్నత్యం శిఖరాగ్రానికి చేరిన దాని ఫలితమే వారు 1865లో స్థాపించిన సమరస వేద సన్మార్గ సంఘం. దీనినే "సొసైటీ ఫర్ రిలిజియస్ హార్మొనీ ఇన్ యూనివర్శల్ సెల్ఫ్ హుడ్" అంటారు ఆంగ్లంలో తరువాత 1872లో యీ పేరునుంచి 'వేద' (మతం) అన్న మాటను తీసివేసి సత్య, శుద్ధ అను రెండు మాటలను తగిన స్థానాలలో వుంచి 'సమరస శుద్ధ సన్మార్గ సత్య సంఘం' అని మార్చారు దీని అర్థం ఆంగ్లంలో సొసైటీ ఫర్ ప్యూర్ ట్రూత్ ఇన్ యూనివర్శల్ సెల్ఫ్ హుడ్ అంటారు మొదటి పేరు వివరణలో కూడా వారి యీ భావన ఇమిడి వున్నది.

'సమరస వేద సన్మార్గ సంఘం' అనగా అన్ని మతాలు సర్వసామాన్యంగా చూపించుమార్గం అనగా అన్ని మతాలకూ ఆధారమైన జ్ఞానమే దీని ఫల స్వరూపం. ఈ సహజ జ్ఞానం నాలుగవ మార్గంలో వుంది దాసమార్గం, సత్పుత్రమార్గం, సహమార్గం, సన్మార్గం ఇవి ఆ నాలుగు మార్గాలు అని పేర్కొంటారు. సాంప్రదాయికంగా వస్తున్న వ్యాఖ్యానాల వల్ల దాసమార్గం అంటే భగవంతుని ప్రభువుగా ఎంచి ఆ మార్గంలో దరిచేరుట. అనగా భగవంతుని సేవచేయటం అనీ, సత్పుత్రమార్గం అంటే భగవంతుని తండ్రిగా ఎంచి దరిచేరుట (తనను భగవంతుని పుత్రునిగా భావించి) అనీ, సహమార్గం అంటే మిత్రునిగా భగవంతుని ఎంచి దరిచేరుట అనీ, 'సన్మార్గం అంటే భగవంతునితో తనను తాము వొకనిగా ఎంచు కొనుట అనియు తెలియుచున్నది.

రామలింగ ఉద్దేశ్యంలో ఈ వ్యాఖ్యానం ఆ మార్గాలకు మతసంబంధమైన మార్గానికి ఆదర్శంగా వున్నాయి. వారు యీవిధంగా 'భగవంతుడు' అన్న మాటకు బదులు 'జీవము' అని మార్చి వారి 'సమతాదృష్టికి మంచి మార్గము' నకు సరియైన విధం యీ మూడింటికీ తత్సమాలను కూడా పేర్కొన్నారు.

సకల జీవులు ఒకరి సంరక్షకత్వం కింద ఉన్నట్లుపరి
గణించడమే దాస మార్గం. సకల జీవులు ఒకరి బిడ్డలుగా
భావించడమే సత్పుత్ర మార్గం. సకల జీవులను ఒకరి సహ
వాసులుగా భావించడమే సహ మార్గం. సకల జీవులు ఒకటి
గా భావించటయే సన్మార్గం.

ఆ విధంగా ఒక యుక్తితో 'సన్మార్గ' మార్గ దర్శకత్వాన్ని దైవంనించి విశ్వానికి తిప్పి వేశారు. రామలింగ - అగోచరమైన పరమాత్మ నుంచి జీవిలో వున్న పరమాత్మకు, జగానికి దూరంగా వున్న పరామాత్మ నుంచి విశ్వంలోనే భగవంతుని దగ్గరకూ వారి ధర్మానికీ ధర్మమార్గానికీ ( దాన్ని మతం అనకూడదు, ఎందుకంటే మతం అనే మాటను వారు పూర్తిగా విడిచి పెట్టారు). ప్రధానమైన పట్టు కొమ్మ 'జీవ కారుణ్యం' అనగా ప్రాణికోటి పట్లదయ

నాలుగవ మార్గం యొక్క సహజ స్వభావం - ఆ మార్గం అవలంబించిన వెంటనే ప్రతివారిలోనూ కలిగే మనోవైఖరి యీ క్రింది వాటిలో ఇమిడి వుంటుందని నిర్వచించారు.

హింస చేయకండుట, ఓర్మి, సమచిత్తత, స్వాదీన చిత్తం,
మనో వికారం వీటిని అదుపులో వుంచుకొను శక్తి, ఆత్మయొక్క
సహజ గుణమైన జీవిపై దయ.

జీవహింస కూడదు అన్నది మొట్ట మొదట వారుచెప్పడం, జీవిపై దయను 'ఆత్మ యొక్క సహజ గుణం' గా ప్రత్యేకించి దానికి లక్షణాలు చెప్పడం గుర్తించవలసిన విషయం. ఇది సహజ పరిణామంలో జరుగుతున్న 'బలమున్న వారిదే బ్రతుకు' అన్నదానికి సరిగ్గా వ్యతిరేకంగా వుంది. బహుశా ఉన్నతావస్థలలో అణాధారణ సూత్రాలు పని చేస్తాయేమో. రామలింగ ప్రవచించిన సమదృష్టి మార్గం కూడా యీ విశ్వంలో జీవితంతో మానవుని సంబంధాన్ని స్థిరపరుస్తుంది. ఇది భగవంతునితో మానవునికి ఉన్న సంబంధానికి భిన్నంగా వుంది.

రామలింగ దృష్టిలో శైవంలోని నలుగురు ప్రవక్తలూ నాలుగు మార్గాలకు ఆదర్శమూర్తులు. భగవంతుని ఆరాధనలో అప్పర్ లేదా తిరునవ్కరసర్ భగవంతుని సేవకునిగా, జ్ఞాన సంబందర్ భగవంతునికి పుత్రునిగా, సుందరర్ భగవంతునికి సేవకునిగా, మానిక్కవాచకర్ భగవంతుని ప్రేమమూర్తిగా తనలోనే సాధించగలిగారు.

1867లో సన్మార్గ వేద ధర్మశాల (ఫ్రీ ఈటింగ్ హౌస్ ఫర్ ది బ్రదర్ హుడ్) ప్రారంభమయింది. జీవకారుణ్య జుక్కం (జీవకారుణ్య సూత్రాలు) అన్న ఒక చిన్న పుస్తకాన్ని ఆ సందర్భంగా చిదంబరం వెంకట దీక్షితర్ చదివారు. ఈ పుస్తకాన్ని రామలింగ 1866కు ముందరే వ్రాయడం ప్రారంభించారు. దానిలో యీా విధంగా వుంది.

మానవ జన్మవంటి మహదావకాశం ద్వారా సుఖానుభవ ప్రాప్తి పొందాలని ప్రజలు వెంటనే గుర్తించాలి. సుఖానుభవ ప్రాప్తి సర్వ జీవుల సర్వకర్మల, సర్వ వస్తువుల సర్వలోకముల ద్వారా తేజో కటాక్షం ప్రసరించు అనే ఆనందము ఉన్నదను గుర్తింపు తద్వారా ఏ సమయంలోనూ, ఏ విధంగానూ, ఎద్దాని వలననూ, అవ రోధంలేని ఉన్నత జీవితాన్ని పొందడానికి తోడ్పడడం జరుగుతుంది

ఈ విధమైన జీవితానందాన్ని పొందడానికి భగవంతునిలోని సహజ గుణమైన అతని కటాక్షం పొందటమే మార్గం

ఆ కటాక్షాన్ని పొందడానికి ఒకే మార్గం తప్ప వేరు మార్గం లేదు. భగవంతునిలోని సహజ గుణమైన కటాక్షాన్ని తమ సహజ గుణంగా చేసుకోవటం. భగవంతుని సహజగుణం జీవులపట్ల అనుకంప.

ఈ చిన్ని పుస్తకాన్ని వారి శిష్యులు 1879లో వారు దివంగతులైన అయిదు సంవత్సరాలకు ప్రచురించారు. రామలింగ తమ శిష్యులకు వ్రాసిన ఉత్తరాలలోనూ, మత ప్రసంగాలలోనూ చెపుతూ వచ్చినట్లు సత్య మార్గానికి ప్రధమ సోపానమైన 'జీవులపై అనుకంపకు నీతి' అని యీ పుస్తకానికి పేరు పెట్టడం గమనించ తగినది. ఇది అన్ని సిద్ధాంతాలకూ, వాదాలకూ, మతాలకూ, జాతులకూ అతీతమైనది గనుక అన్ని మతాలకూ ఇది ఆమోదయోగ్యమై వుండాలి

సర్వోత్కృష్టతేజో కటాక్షానికి అభ్యర్థన అని వారు చెప్పిన ఒక వినతిలో ఇలా ప్రార్థించారుః

సర్వేశ్వరా! సర్వాధీశ్వరుడవై ప్రకాశించు నాపెన్నిధానమా!
ఇకనుంచి మా మనసులు మత, కుల, సంబంధమైన మూఢ ఆచార,
కర్మకాండలతో అపవిత్రం కాకుండాను, జాతి వర్ణములవంటి
సాంస్కృతిక మాఢత్వములకు దూరంగాను ఉంచవలసినదిగా
అనుగ్రహించమని అభ్యర్థిస్తున్నాను.

జీవులలో, ఆత్మను గుర్తించు జ్ఞానమే నిజమైన వే
దాంత పరిశోధకుని అసలైన పరిశోధనాంశం అన్న ఎఱుక,
ఏ చోటను, ఎట్టి విధంగానూ, ఏ సమయమందైనా, ఎంతమాత్రం
గానైనా, మమ్ము విడనాడకుండా ఎల్లప్పుడూ వెలుగొందుచూ
మమ్ముల నడిపించాలి

ప్రభూ, ప్రజ్వలిత కాంతి స్వరూపా నీ దయకు మా కృతజ్ఞతలు, ఇవే మా కృతజ్ఞతలు

# అధ్యాయం 11

# జీవకారుణ్యం

జీవులపై కారుణ్యం ఆధ్యాత్మిక జీవితంలో దాని స్థానాన్ని గురించి రామలింగ తర్కించుతూ వెలువరచిన వాదం మానవుడు ఆ దిశలో చేరుకున్న అత్యంత ఉన్నత స్థాయికి వారు చేరుకున్నారు. వారి సంకల్పానుసారమే వారిలో నిక్షిప్తమైన కరుణకు భావార్థకంగానూ, పరమశ్రేష్ఠమైన అనుగ్రహంతో వారు జీవించారు, తిరిగారు దండపాణి స్వామి వారు రామలింగని కారుణ్యానికి అవతారమే అని తమిళంలో అనే వారు.

ప్రగాఢమైన కారుణ్యాన్ని స్పష్టంగా వర్ణించడం వారి పద్యాలలో హృదయ స్పందనతో, హృదయ విదారకమైన స్థాయికి చేరుకుంది వేరు వేరు సందర్భాలనుంచి తీసిన యీ పద్యాలు. ఒకచోట కూర్చడం జరిగింది.

ఎండిన పంటచేలను చూసి నా మనసు క్రుంగి పోయెదను
ఇంటింట బిచ్చమెత్తు అభాగ్యుని గమనించు చుంటిని
నిష్ఫలమగు ఆతని శ్రమ, ఆకలితోను క్రుంగిను దురించెను
నే చింతించితి చాలసేపు. దీర్ఘబాధ కలిగించు రోగములు చూసి
నే కంపించితిని కూటికి లేని వారు, బీద, బిచ్చ మెత్త బిడియపడుచు,
వారి ధైర్యము కుంటుపడ నే క్రుంగిపోతిని
ఓ అంతిమవరమా, విశ్వాంతరాళమున వెలుగొందు స్వామీ
మానవ ప్రాణులు ఆకలితో అలమటించుటకనినను, వినినను,
వారాకలితో గడుపుతున్న, భయమునన్నా వరించును
మస్తిష్కమున మంటవోలె, వేగమున ప్రజ్వలించుచు,
నా దేహము కంపించును
ఆలమందలలసిన యరపులు –
దిగులొందించెనన్ను.
బిక్కచిక్కిన పశువు, మృగము
నన్ను మరింత కృశింప చేయును.

బాతులు, కోళ్ల అరుపులు విని
మనస్థిమితమును కోల్పోవుదును
ప్రభూ, మారణాయుధమైన కత్తి
కరకు కసాయి చేత వ్రేలాడు చుండ చూసి
నే కంపించితిని భయముతో
ప్రజలు గొంతు లెత్తి కొట్లాడుచుండ
నాలో కంపన కలిగెను.
ఉన్మత్తతతో వారు తలుపు తట్టు చుండ
నా కపశృతి తోచెను
ఓ ప్రభూ, నీకు తెలుసు, ఎవరైన రోదించుచుండ
ఆ మాటలు నాలో చీల్చుకొని పోవును
వ్రేళ్లు పెకలించు పెను తుఫాను వోలె
ఓ మానవాతీత, మూలాధారమవా
నా అంతిమ ఆకరము, నా ప్రభువా,
నేను నీ సేవకుడను, చుట్టాలతో ముడివడితిని
మిత్రులు, సహవాసులు, తల్లి, సోదరులు,
సోదరీమణులు, ఇతరుల బాధతో వ్యధనొందితి
వారి వదనములపై మబ్బులు క్రమ్ముట చూసి
నీకు తెలుసు
ఓ తండ్రి విశ్వనాటక రంగమున ప్రభవించు ప్రకాశమా
నా దైవమా, నా మహోత్కృష్ట పరమావధి
నే మరల తెలుప వలెనా
నా మనమును కలత నొందించు వ్యధ,
ఈ వ్యధా పూరిత జగమున
తల్లియు, సహవాసులు, మిత్రులు,
నా సన్నిహితులు, నాతరువాతి వారును,
నాకు దూరముగా వున్న వారును,
బాధపడుట, బాధపడుచుండ నేచూచుట,
ఆకలి బాధ, అనారోగ్యపు బాధ,
దహియించు బాధలు,

ప్రభూ, నీకు తెలుసును
ప్రభూ, నీ నృత్యమే మాకు దీవెన
బీజము, అంతిమ ఫలము
ఈ జరుగుచున్న జగన్నాటకము
ఘోరమైన వాంఛలతో, ఊపిరాడకుండగ,
తలలు నెరసిన వారును, చిన్నవారును,
తెలిసియు తెలియని వారు నాకు వివరింప
వారి ఆపదలు, సంకటములు,
నా మనసు విచలితమగును, వణకును,
ప్రభూ, నీకే తెలియును.

మాంసాహారం ప్రధానంగా క్రూరమైనదిగాను, అనైహికమైనదిగాను ఎంచి వారు విసర్జించి, వారి సహవాసుల నుంచి మాంసాహారులను బహిష్కరించారు ఈ విషయం తమకు స్వయంగా ఆపరమాత్మ నుంచియే అందినదని కూడ వారు నిశ్చయంగా తెలియ చేశారు.

నాకు హితము బోధించు కృపాసాగరా ప్రభూ
నన్ను దూరముగా వుంచుము, జీవహింస చేయువారికి
మాంస భక్షకులకు, వారన్యులు
వారితో ఏ విధమైన సంబంధములుంచు కొనకుము
మరి ఎట్టి బంధములుగాని, అక్కడ కలిగినప్పుడు మాత్రము
ఆకలి బాధ నుంచి వారిని రక్షించుటకు,
కనికరమునకు సార్థక్యముగా, కనికరముతో
సమస్త జీవులకు నిష్ఫలముకాని ప్రమాణము, ఓ ప్రమాణము చేయుమ
ప్రతిధ్వనించు మహిమలు గల ప్రభూ, దయా సాగరా, ప్రభూ
సర్వ శ్రేయస్సుకై నర్తించు నీ ప్రభావము ప్రభూ.
మాంసాహారాన్ని వారు గట్టిగా ఖండించారు;
మహిమలు చేయుటలో సిద్ధహస్తుడు,
మగవాని మార్పు జేసినప్పటికిని
మగువగా, ఆమగువ, నవయౌవన రూపవతియై,

క్షణములో తిరిగి మగసిరిగల యువకుడై,
చనిపోయిన వారి నుంచి సచేతనులుగ చేసినను,
నా స్వామిపై ఆన, నా యాన
ఆ ప్రభువు ప్రకాశవంతమైన జ్యోతిపైన
ఆ వ్యక్తి నెంచవలెనన్న దయా రహితుడైన వాని ఎదలో
జీవికి గృహమైన దేహమును భక్షించుటకు, ఆహారమిడుటకు
అట్టివానినే భక్తితో నెంచ
జంతువుల మాంసం భక్షించుట అంటే భీతిని ప్రదర్శించే వారాయన!
మానవులు తమ ఆహారము
మాంసముతో చేయుచుండ చూడగా
అది పలు మార్లు గురుతు చేయు బాధనాకు,
నే కంపింతు, సొమ్మసిలుదు, నా దేహము కుచించుకు పోవు,
కాలి బొగ్గుగా మసియై నలుపెక్కిన
నా వ్యధిత మానసము నీ వెరుగుదువు
అలసిన నా మనము, నా ప్రభువా!
తిరిగి, తిరిగి హింసా కాండపై తమ భీతిని వ్యక్తం చేశారుః
కంపించితి నేను చూసితినే ఘోర హంతకుల
పదను గొడ్డలి వడి వ్రాలుచుండ పడియున్న ప్రాణిపైన
నా కండ్లతోనే చూచు చుండగనే
తెగిపోవు ప్రాణి భరింపరాని వేదన,
లేక జాలరి వల యినుక తిన్నెపైన
ఎరతో గూడి, చిక్కముతోగూడి త్రాడు , లేక బోను,
ప్రభూ, ప్రభూ, నా తండ్రీ, నీకును తెలియును
ఎట్లు, ఏలాగు తెలుపుదును నా వేదన?
జంతుబలులకు వ్యతిరేకంగా వారిలా చెప్పారు.
చిన్న చిన్న క్షుద్రదేవతల వారు
వారి వారి పేర్లపై వీరు, భువిపై నుంచి
చంపుదురు గొఱ్ఱెల, పందుల, కోళ్ల, నితర జంతువుల,

రక్తము చిందించుచు వాటి బలమైన దేహముల
నేను ప్రత్యక్ష సాక్షిని దీనికి, అలసిపోతిని;
నా వివేకత వమ్మగుచున్నది, నీకు మతి భ్రమించుచున్నది.
విద్వేష పూరిత, రక్తవర్ణ గృహములు
ఈ క్షుద్రదేవతలుండునవి
చూచుటకు నాకు బాధ కలుగుచున్నది
వారిలా ప్రార్థిస్తున్నారు;
ప్రభూ అనుగ్రహింపుము నన్ను
స్వచ్ఛమైన దయా పాత్రునిగా
సహాయపడుము నాకు
ప్రజలను వారి దుఃఖముల నుంచి భయముల నుంచి దాటించుటకు
తోడ్పడుము నాకు,
హత్యా రహిత ప్రపంచము నొకటి పెంపొందించుటకు,
చంపి భుజించకుండ,
పొడ నీనన్ను
నీ మహిమ అనంతముగా-
ప్రభూ నా తల్లీ,
నిన్ను ప్రార్థింప నిందుకే

ప్రజల నుంచి ఎ వేనా విరుద్ధంగా ప్రతీకార చర్యలు జరుగుతాయేమోనని, వారి ఉపదేశాలను ప్రజలకు ఇవ్వడం మానుకున్నారు వారి ఆవేదనలను ఆ భగవంతుని ముందే వుంచేవారు. ఎక్కువ సంఖ్యలో శాకాహారులు ఈ నాడు తమిళనాడులో వుండడానికి ప్రధాన కారణం రామలింగ స్వామి వారే. రామలింగ శిష్యులు వేలాయుధ ముదలియార్ వారి గురించి యిలా వ్రాశారు 'వారిలో ఒక వింత శక్తి వుండేది అది చాలాసార్లు ప్రకటితం అయింది. మాంసాహారులను శాకాహారులుగా మార్చడానికి, వారు ఒక్కసారి ఆ వ్యక్తివైపు దృష్టి సారించి చూస్తే చాలు, మాంసాహారం మీద ఎదుటి వారికి కోరిక చచ్చిపోయేది.

రామలింగని ఆధ్యాత్మికానుభవ సిద్ధిలో జీవులపై అనుకంపకు ముఖ్యమైన స్థానాన్ని ఇస్తూ వ్యాఖ్యానించడంలోని తార్కికవాదం --పరమాత్మతో అతనికి ఉన్న సంబంధానికి భిన్నంగా ప్రాపంచిక సంబంధం దృష్ట్యా ఇచ్చిన వ్యాఖ్యానం 'సర్వమానవ సాభ్రాతృత్వ సంఘం' అన్న క్రిందటి అధ్యాయంలో చూడవచ్చు.

## అధ్యాయం 12

# కరుణారస పవిత్ర గ్రంధం

కరుగుంజి (1858 - 67)లో వారు జీవించిన కాలంలో 1856లో వారు స్థాపించిన సన్మార్గ సంఘం రామలింగ జీవితంలో రెండవ దశలో జరిగింది. నిజానికి ఇది వారి కడలూర్ (1867-70) జీవితంలోని మూడవ దశకు బీజం. అంతేకాదు మొదటి రెండు దశలు వారు కరుంగుజిలో జీవించిన చివరి రోజులలో సుఖాంతానికి వచ్చి, వారి శిష్యులు వారి పద్యాలలో చాలా భాగం అచ్చువేశారు.

భక్తి శ్రద్ధలతో యీ కార్యభారాన్ని తమపై వేసుకున్న శిష్యులు పాండిచ్చేరికి చెందిన వేలా ముదలియార్, సెల్వరాయ పురానికి చెందిన శివానంద ముదలియార్, ఇర్కుక్కంకి చెందిన రత్నముదలియార్, ఈ పుస్తకం వెలువరించిన రత్నముదలియార్‌కు మనం చాలా కృతజ్ఞులం

మద్రాసులో గడిపిన కాలంలోనే రత్నముదలియార్ రామలింగపద్యాలు, కీర్తనలు అచ్చు వెయ్యాలని సంకల్పించారు. ఆ రోజుల్లో చెదురు మదురుగా కొందరు ముద్రాపకులు వారి రచనలు అప్పుడప్పుడు అచ్చు వేసుకుంటూ వుండేవారు. తగిన నష్టపరిహారం చెల్లించి వారిని అచ్చువేయకుండా నిలుపు చెయ్యడానికి వారు ప్రయత్నించారు కాని, ఫలితం దక్కలేదు అప్పుడు వెతికి, వెతికి ఎక్కడెక్కడ వారి రచనలున్నవో అవన్నీ సేకరించడానికి తమశక్తినంతా వినియోగించి వాటిని అచ్చువేసేందుకు రామలింగ అనుమతి తీసుకొనే ప్రయత్నం చేశారు. రామలింగ ఉపేక్ష చేసేవారు. 1860 నుంచి 1866 వరకూ ఆరు సంవత్సరాలపాటు రత్న ముదలియార్ పట్టు పట్టారు. దీనికి వారిరువురి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలే సాక్ష్యం 'ఈ పుస్తకం అచ్చువేసే దాకా నేను రోజుకు ఒకపూట మాత్రమే భోజనం చేస్తానని రత్నముదలియార్ 1860లో రామలింగకు ఉత్తరం వ్రాశారు. ఈ ఉత్తరం దొరకలేదు కాని దీనికి రామలింగ యిచ్చిన సమాధానాన్ని బట్టి గ్రహించవచ్చు. 'తన పద్యాలను సేకరించ వలసినదిగాను, కాని, తన కంటిపాప వలె ప్రియమైన మిత్రుని ఆ శపధమును విరమించు

కొనవలసినదిగా రామలింగ కోరారు. అలా కాని పక్షంలో తాము కూడా అట్టి వ్రతమే అవలంబించవలసి వచ్చునని తమ సమాధానంలో 30 డిశంబర్ 1860న రామలింగ వ్రాశారు. చివరికి రత్న ముదలియార్ వారి పద్యాలు సేకరించి 1867 లో ప్రచురించడంలో కృతకృత్యులయ్యారు. పుస్తకంలోని విషయసమీకరణం, కూర్పు రామలింగ ముఖ్యశిష్యులైన తొజువూర్ వేలాయుధ ముదలియార్ చేశారు. దీనిని నాలుగు భాగాలుగా విభజించి, యీ పుస్తకానికి కరుణారస పవిత్ర గ్రంథం అని పేరు పెట్టారు. అరవై ఆరు పద్యాలలో అను బంధము నాకదాన్ని చేర్చి రామలింగ జీవిత చరిత్రను, యీ పుస్తకం అచ్చయిన విధం చెపుతూ వారికి కానుకగా సమర్పించారు మైలాపూర్ వాసి సోమసుందర చెట్టియార్ ధన సహాయం చేయగా 'మద్రాసు 292 లింగచెట్టి వీధిలోని ఏషియాటిక్ ముద్రణాలయం' వారు దీనిని అచ్చువేశారు.

ఈ సుదీర్ఘ కార్యం జరుగుతున్నపుడు రామలింగ పేరును పుస్తకంలో రామలింగ స్వామి వారు అని అచ్చువేయడానికి అనుమతించవలసిన్దిగా కోరుతూ రత్నముదలియారు 1866 మార్చిలో రామలింగకు లేఖ వ్రాశారు. రామలింగ సమాధానం యిస్తూ 'అది ఇష్టానికి వ్యతిరేకం, రామలింగ స్వామి అనిపించుకుంటూ ఊరేగడం నాకు ఎంతమాత్రం ఇష్టం లేదు. ఆ గుణ విశేషం దర్పంతో కూడినదిగా నాకనిపిస్తోంది. కనుక దానిని విడచి పెట్టడం మంచిది' అని జవాబు వ్రాశారు. అయినా వారికి శ్రద్ధా గౌరవాలు చూపించాలని తనంత తానే నిర్ణయం తీసుకొని వేలాయుధముదలియార్ పుస్తకంలో గురువు గారికి తాను కల్పించిన అరుట్ ప్రకాశ వల్లాలర్ తేజోమయకటాక్ష రక్షకుడు అయిన చిదంబరం రామలింగ పిళ్లే అని అచ్చు వేశారు. రామలింగ ఆ పుస్తకాన్ని చూసి చాలా బాధ పడ్డారు "తేజోమయ కటాక్షం కలవాడు ఎవడనియా రామలింగ ప్రశ్నించుచుండుట?" అని శిష్యులతో చెప్పి సమాధాన పరచుకొన్నారు. తమిళంలో ఆ మాటలకు ఆ విధంగా కూడ అర్థం చెప్పవచ్చును.

ఆ పుస్తకం ప్రచురణ సందర్భంలో జరిగిన యీ సంఘటన ద్వారా రామలింగస్వామి వ్యక్తిత్వం ప్రతిఫలిస్తూ వుండే యీ దిగువ సంఘటన వ్యక్తిగా వారిపై ఒక వ్యాఖ్య

ఆ పుస్తకం అచ్చు అయ్యే సమయానికి రామలింగ కరుంగుజి వదలి వడలూర్ వెళుతున్నారు. అప్పటికే వారి ఆధ్యాత్మిక వికాసం మరొక ఉన్నత దశను వడలూర్‌లోను, అటు తరువాత మెట్టుకుప్పంలో పరిపూర్ణస్థాయికి చేరుకుంది. వారు అన్ని కర్మకాండలు, మతాలు, మతబోధలు వీటన్నిటికీ అతీతంగా పయనిస్తూ అవాఙ్మానస తేజోస్వరూపం అనే దివ్యానుభూతిని దర్శించే వారు. మతస్థులు చాలామందికీ వారికీ ఇది విరోధాన్ని కలిగించింది, వారిలో ముఖ్యులు, ఛాందసుడైన శైవ ఆర్ముగనవలర్ తక్కిన వారు రామలింగపై వున్న గౌరవం కొద్దీ పక్కకు తొలగి పోయినా నవలర్ మాత్రం మండి పడ్డాడు. మత విద్రోహిపై గౌరవ సూచక విశేషణాలను వాడడం ఆయనకు ముఖ్యంగా మరింత కోపకారణం అయింది. తిరు-అరుత్-పా(కరుణా పూరిత పవిత్ర గ్రంధము) వారి పుస్తకానికి అన్వయించినది, తిరుముర్రై (పవిత్ర ప్రార్ధనలు) పుస్తకంలోని భాగాలకు అన్వయించారు కాని యీ పదజాలం క్రీ శ 7, 9, శతాబ్దాల మధ్య జీవించిన నయనారులు శైవకవులూ శివుని కీర్తిస్తూ వ్రాసిన కావ్యాలు తేవారం, తిరువాచకం వీటికే అన్వయించాలి గాని, తరువాత శతాబ్దాలలో వచ్చిన మత ప్రవక్తల ఆధ్యాత్మిక వేత్తల రచనలకు అన్వయించకూడదు. రామలింగ 'సన్మార్గ' అనే క్రొత్త మతం, ఇతర మతాలకుముఖ్యంగా క్రైస్తవ మతానికి చొరబడేందుకు అవకాశం కల్పిస్తోంది అని నవలర్ భావించారు వారు ఒక పెద్ద వివాదం లేవనెత్తారు అరుత్-పా(కరుణారసపూరిత గ్రంధం) ఇది ఒక మురుల్- పా( అంధకారమునిచ్చు పుస్తకము) అని వర్ణిస్తూ 'అబద్ధపు కటాక్షమును ఖండించుట అనే ఒక చిన్న పుస్తకాన్ని తీసుకువచ్చారు. క్రిందటి శతాబ్ది చివరిలోను యీ శతాబ్దపు తొలి రోజులలోను యీ వాదం పెరిగి పెద్దగాలి వానగా చెలరేగింది రామలింగ గొప్ప కవిగా గుర్తు పొందలేకపోవడానికి యిది కొంత వరకూ మబ్బుతెరగా అడ్డుపడింది

ఈ కలహం వలన రామలింగ మార్గాన్ననుసరించే వారిలో యే తేడా లేకపోవడం గమనించి నవలర్ సాధనాలను ఆశ్రయించాడు. చిదంబరంలో యిచ్చిన ఒక ఉపన్యాసంలో తనను కించపరచినందుకు గాను రామలింగపై పరువు నష్టం దావా వేశాడు. తనపై దౌర్జన్యం జరిపిస్తానని బెదిరించారని నవలర్ దావాలో పేర్కొన్నాడు. మంజు కుప్పంలో ఆ కేసు విచారణకు వచ్చింది. నవలర్ ఒక న్యాయవాదిని పెట్టుకున్నాడు. రామలింగ తరఫున న్యాయవాది లేడు

న్యాయస్థానంలో పిలుపు యివ్వగానే రామలింగ న్యాయస్థానంలో ప్రవేశించారు. అక్కడ వున్న జనమంతా ఒక్కసారి లేచి నిలబడి రెండు చేతులూ జోడించి వారికి నమస్కరిస్తూ మార్గం వదిలారు. నవలర్ కూడా అలాగే చేశారు. న్యాయాధిపతి కూడా మనసులో అలాగే భావించి కుర్చీలో కదిలారు, లేచి నిలుచుందుకా అన్నట్లు. కాని న్యాయస్థాన నియమనిబంధనలను గుర్తుకు తెచ్చుకొని, కుర్చీలోనే కూర్చుండి పోయారు. విచారణ ప్రారంభిస్తూ, ప్రతివాదిరాగానే ఎందుకు లేచి నిలబడ్డారు అని నవలర్ న్యాయాధీశుడు ప్రశ్నించారు. అక్కడ ఉపవిష్టులైన వారందరూ లేచి నించున్నారు. అందుకే తనూ లేచి నిలబడ్డాను అని నవలర్ సమాధానం చెప్పాడు. న్యాయాధిపతి అక్కడవున్నవారంతా ఎందుకు లేచి నిలబడ్డారు? అని ప్రశ్నించగా నవలర్ 'గౌరవసూచకంగా' అని సమాధానం చెప్పాడు. న్యాయాధి పతి మీరు కూడా నిలుచున్నారు కదా!" అని ప్రశ్నించారు.
నవలర్ : అవును అన్నాడు
న్యాయాధిపతి : అంటే మీరు కూడా అందుకే నిలబడ్డారని అర్థమా?" అని మరల ప్రశ్నించారు.
నవలర్ : అవును అన్నాడు మళ్లీ.
'వారు గొప్ప వారని మీరంగీకరిస్తున్నారు. మీరు యీ దావా వేసి వుండవలసింది కాదు లేదూ, దావా వేసిన తరువాత, వారు లోపలికి రాగానే మీరు లేచివుండవలసింది కాదు మీరు అప్రయత్నంగా చేసిన యీ పనిని బౌన్ని చెప్పక చెపుతున్నది. ఈ దావా ముగించడమైనది"
ఈ పవిత్ర గంధం గురించిన కథ చివరి వరకూ తీసుకు వెళదాం. కాలక్రమానుసారమైన వివరణలో బాగా ముందు జరిగిన విషయాలు యిక్కడ చర్చించవలసి వచ్చినా యీ సందర్భంలో ఇది చెప్పుకోవడం అవసరం. ఇప్పుడు మనకు లభ్యమవుతున్నది రామలింగ జీవిత కాలంలో అచ్చైన మొదటి నాలుగు భాగాలు కలిసిన పుస్తకం. ఇప్పుడు మనకు ఐదవ భాగంలో తిరుత్తని హై కంద స్వామిని స్తుతిస్తూ వారు వ్రాసిన పాటలు, పద్యాలు, తిరువొత్తియూర్ కాలంలో వ్రాసినవి 1880లో తొజువూర్ వేలాయుధ ముదలియార్ అచ్చువేశారు. వడలూర్, మెట్టుకుప్పంలలో ఉన్నప్పుడు వ్రాసిన పద్యాలు అచ్చువేయడానికి వారి అనుమతి తీసుకోలేదు. వీటిని వేలూరుకు చెందిన పద్మనాభ ముదలియార్, బెంగుళూర్‌కు చెందిన రాఘవులు నాయకర్‌ల ప్రయత్నాల ఫలితంగా తిరుచిరాపురవాసి లోకనాథ చెట్టియార్ 1885లో ఆరవ భాగంగా అచ్చువేశారు. పరిమాణంలోనూ, ఘనతలోనూ అసాధారణమైన యీ బృహద్గ్రంధం కరుణరసపూరితమైన పవిత్ర గ్రంధం (తిరు-అరుత్-పా)

# అధ్యాయం 13

## వ్యక్తిగా వారి గుణగణాలు, లక్షణాలు

వ్యక్తిగా రామలింగ గుణగణాలను ఇక్కడ ముచ్చటించడం సముచితం.

రామలింగం గురించి దివ్యజ్ఞాన సమాజం వారికి వ్రాస్తూ తొజువూర్ వేలాయుధ ముదలియార్ యీ విధంగా అన్నారుః

చూడడానికి రామలింగ సాధారణ మానవుని లాగ వుంటారు. కొంచెం బక్క పలుచగా, పొడవుగా, అస్థిపంజరంలా కనబడేటంత చిక్కిన శరీరం – అయినా దార్ఢ్యంగా నిటారుగా బలంగా నడుస్తూ ఉంటారు గోధుమ రంగు ముఖం. పొడుగాటి తిన్నని ముక్కు. ఎత్తుబారిన పెద్ద కన్నులు. ఎల్లప్పుడూ ఆలోచనను వ్యక్త పరుస్తున్న దృక్కులతో వుండేవారు. చివరి రోజుల్లో జుత్తు పెంచడం మొదలు పెట్టారు,, యోగులలో అరుదుగా మనం చూసేది – చెప్పులు వేసుకొనేవారని. వారికున్న అన్ని దుస్తులు కలిపి రెండే రెండు తెల్లగుడ్డ ముక్కలు. వారి అలవాట్లు చాలా మితమైనవి. ఎప్పుడూ ఏ కొంచెమైనా విశ్రాంతి తీసుకున్నట్లు తెలియదు. కఠోర శాకాహారి. ఏ రెండు మూడు రోజులకో ఒకసారి, అది కూడా కొద్దిగా ఆహారం తీసుకొనే వారు. కాని నెలల తరబడి ఉపవాసం చేసే సమయాలలో మాత్రం చక్కెర కలిపిన వెచ్చని నీరు తప్ప మరే ఇతర ఆహారమూ తీసుకొనే వారు కాదు.

రామలింగ వ్యక్తిత్వంలో ఒక ప్రత్యేకమైన ఆకర్షణ వుంది -- మంత్ర ముగ్ధులను చేసే ముఖం, ఆ ముఖం మనలను సదా వెంటాడుతూ వుంటుంది. దయా కటాక్షాలను వెదచల్లే కనులు, ఉరఒ అడిగళ్ తమిళంలో వ్రాస్తూ యిలా అన్నారు. 'రామలింగని చూసే అదృష్టం నోచుకొనని వారికి "రామలింగ యిలా వుంటారు, ఆయన రంగు యిది, ఆయన సమక్షంలో యిలా వుంటుంది అని వర్ణించడం వ్యర్థమే." "ఫోటో గ్రాఫు కెమెరా పరిధికి అతీతమై పోయింది ఆ మహాత్ముని దేహం " అని చెబుతారు. వారి చిత్రాన్ని ఫోటో తియ్యడం సాధ్యపడలేదు. ఎందుకంటే 'ఛాయ' ఎక్కడా పడలేదు గనుక

దైవభక్తి కలిగిన రామలింగ ఆత్మకథా రీతిలో తనను గురించి తన పరిస్థితులను గురించి, తన అనుభవాలను గురించి మరువరాని దృశ్యచిత్రాలతో వర్ణించి చెబుతూ వుంటారు. అందులో వారి శరీర లక్షణాలు, అలవాట్లు, దుస్తులు, వంటి విషయాలను గురించి కూడా ఉదాహరిస్తూ ఉంటారు.

వారి దుర్బల శరీరాన్ని గురించి ఇలా వ్యాఖ్యానించారు:

నాకు, మనసును సాధువుతో పంచు
శారీరకముగా శక్తి ఉడికి, నీ కొరకు శోధించు
నీవు పలుకకున్న మరి ఎవరున్నారు,
ఓ ప్రభూ! గంశతోడ
మరి చంద్రుడు నీ కోసం శిఖలందు?

వారెప్పుడు తెల్లటి వస్త్రాలనే ధరించేవారు. వారికున్న దుస్తులన్నీ కలిపి, రెండే రెండు తెల్లని పొడవాటి వస్త్రాలు మాత్రమే. మరే యితర దుస్తులూ లేవు. మరే ఇతర రంగులూ వాడలేదు. శైవప్రవక్తలు వలుగురూ వస్త్యామలే. వారు కూడా శ్వేత వస్త్రధారణనే చేసేవారు ఒక ప్రసంగంలో రామలింగ ఇలా అన్నారు.

జేగురు వసనములు సంపూర్ణతకు గురుతు, ఆ సంపూర్ణతా
మానవుడు తన అంతర్గతమై వున్న స్వభావముతో పోరాడవలె
తనలోని స్వభావమును సాధారణముకొన్నవాడు గడించును
దయ, అటువంటి వానికి తగిన రంగు తెలుపు

తన తెల్ల వస్త్రాలను గురించి ఒక పద్యంలో చెప్తుతూ మరికొన్ని ఇతర విషయాలను గురించి కూడా రామలింగ పేర్కొన్నారు:

చేతులూగింప సిగ్గుపడి
నే నడచితి చేతులు జోడించి
నగ్నముగా వుండ నిచ్చగించక
దేహమును, శిరసును శ్వేత వస్త్రముతో కప్పుకొంటి;
నా చూపు పోనీయలేదు
చురుకుదనము మెదలుచోటు
నన్నాదృశ్యము కుపితుని జేయునని

ఈ సంచలిత దృశ్యం రామలింగలోని మానవతాంశాన్ని మనకు చూపిస్తుంది. ఆడంబరంగా దుస్తులు వేసుకోవడాన్ని వారెప్పుడూ విడిచి వేశారు.

ఒకసారి నా స్నేహితుని వస్త్రములిమ్మని ఇబ్బంది పెట్టితి
జిలతారు వస్త్రములు —
ఓ ప్రభూ, ఆ ఘటన నాకు కలిగించిన ఆవేదన
ఆవేదన వారిలో కలిగినది!
మండు యెండలో ఆపుడు
నాకై గొడుగు పట్టితిరి వారు,
నే కుచించుకుపోతిని, చేగుడ్డ చేతిలోనిది
మొలలోన దోపుకొని, చేతులు స్వేచ్ఛగా వదలితిని
అంజలిఘటించుట కనువుగా

అంతేకాదుః

ఉన్నతాసనములు నన్నస్థిమితుని చేయును
మడగాళ్లు వైచి కూరుచొనుట ఒక భంగిమగా దోచును
మెత్తని పరుపుపై పరుండ సాహసించను
వేదికపై కూర్చొని, నా కాళ్లు
చాచుటకు వెరతును నేను,
గట్టిగా భాషించుట బాధ కలిగించును నాకు
వీటి నుంచి కాపాడు తల్లీ.

వారు అతి తక్కువగా భుజించే వారు. మొదటి మొదటి రోజుల్లో వారు, రోజుకు రెండు సార్లు భోజనం చేసేవారు. తరువాత రోజుకు ఒకసారి మాత్రమే. అటు తరువాత రెండు మూడు రోజులకొకసారి, అది కూడా కొద్ది ముద్దలు మాత్రమే తినేవారు ఒక్కొక్కసారి చక్కెర వేసిన నీళ్లు మాత్రం త్రాగుతూ రెండు మూడు నెలల వరకూ ఉపవాసం చేస్తూ వుండేవారు. చివరికాలంలో వారు ఆహారాన్ని పూర్తిగా విసర్జించారని శిష్యులు చెబుతారు. ఈ విషయాన్ని కూడా వారు తమ పద్యాలలో చెప్పారు.

మరి దినమున రెండుసార్లు భుజించినపుడు
నిదురించి దీర్ఘకాలము – అనిదురయు,
ఆహారము నీ సేవ చేయు నన్ను చేసితివి...
మరి ఒకేసారి భుజియించినపుడు, నా తండ్రీ

నా చుట్టూ తిరుగువారు, విభ్రాంతులై, ప్రశ్నింతురు నన్ను
వారిట్లు ప్రకటించారు —
వరద వెల్లువలో
నిత్యము తిరిగి చేయు, అతిరుచికర భోజ్యములను,
నియమనిష్ఠల, కాయక్లేశముల ఫలము వ్యర్థమగును
ప్రవహించునదిలో వైమ చింతపండులాగా

వారు తక్కువగా నిద్రపోయేవారు. అర్ధరాత్రి నుంచి తెల్లవారుఝామున మూడు గంటల వరకు మాత్రమే నిదురపోవాలని వారు శిష్యులకు సలహా యిచ్చేవారు. మెట్టు కుప్పంలో ఉపన్యాసాలు ఇచ్చేటప్పుడు పగలు ఒక్క గంట మాత్రము విశ్రాంతి తీసుకోనవలసినదని శిష్యులకు సలహా ఇచ్చేవారు వారి యౌవనంలో పగటిపూట మూడు గంటలు నిద్రపోయే వారట. తరువాత కొన్నాళ్లు రెండు గంటలు, ఆటు తరువాత ఒక గంట మాత్రమే నిద్రపోతూ చివరకు పగటి పూట నిద్ర పూర్తిగా మానివేశారని వారి శిష్యులు చెపుతారు. " నా మంచి నిద్రను తరిమివేసినావు. అని భగవంతుని కీర్తించారాయన. నిద్రపోవటం అంటే భయం వేస్తున్నదని వారొక సందర్భంలో అంటారు.

కాలము ముందు వెనుకల వెలుగొందు సర్వోత్కృష్టమైన తేజమా
నన్ను నీ వానిగ చేసికొంటివా? నేనసహ్యించుకొందుప్రాలుమాలు
నిదుర పవలు రేయి నన్నావరించు, నన్ను చీకాకు పరచునది
నాదరి చేరుటయే, సమ్మతి లేకనే నిదురింతు; మరి
మేలుకొని నపుడు, నిన్ను దలంతు ప్రార్థింతు నిన్ను,
'ప్రభూ, నిదుర నుండెపుడు విముక్తి నిత్తువు నాకు?"

వారు నిద్రను బహిష్కరించారుః

నిద్రా, నీవు సోమరిపోతువు, అవివేకివి, పిచ్చిదానివి జాగ్రత్త!
ఈ హెచ్చరిక పొందిన అరక్షణమునందు,
నీవు, నీ పరివారముతో, నన్ను విడువనిచో
నిన్ను శపియింతును,
నే దుఃఖమును అధిగమించితిని, నేద్ధి పొందితి
సృజనాత్మక శక్తి, పరవశ మొందితిని నేను నా కొరకు నే కొరగాను,

తొలగి పొమ్మి మరి శీఘ్రముగా! - నాకు వెనుకగా
స్వరూప, మణురూపము అగు స్థితి గల నా ప్రభువు

వారు స్వచ్ఛమైన నిష్కాపట్యం, స్వచ్ఛమైన వినయం, స్వచ్ఛమైన పవిత్రతలతో నిండు కటాక్షంతో వుండేవారు. గొప్ప మానవులలో సహజంగా వుండే దుర్బలత్వం అదే కీర్తి కాంక్ష అది కూడా వారికి లేదు. భగవంతుని లోనే జీవిస్తూ పరిపూర్ణులయ్యారు.

ప్రపంచం మరచి నేకోరితి నవామకునిగా
ఈ ప్రపంచమునకు, మరినేకనుగొంటి ప్రజల
దృష్టిపడినది వీధిలోన, అదిగానియీ
ప్రాపంచిక సంకటము కాదు కదా?
జ్ఞానబోధగావింపుము, నాదైవమా, నే బాధాతప్తుడనైతి.

మానవుడు చివరగా సాధించునది —మనసును పూర్తిగా జయించడం ఇది వారు సాధించారు. వారు తమ నుంచి మనస్సును పూర్తిగా వేరు చేయగలిగారు.

మర్కట మగు మనసా, అజ్ఞానివి, పిచ్చిదానివి,, తొలగిపొమ్మి!
నిలుపుము నీఅల్లరి చేష్టలునాతో, నీవు ఇతరులతో నాడునవి!
నన్నుగూడు వారిలో నొకనిగానెంచకుము
నీ హద్దులలో నుండిన, ఉండనీయవచ్చును నిన్ను
లేనిచో, పోవచ్చును నీవు!
నీకే మాత్రము వెసులు బాటు నేనివ్వను
తెలుసుకొనుము నన్ను సత్యమార్గ సంధాయి
ప్రభువు యొక్క నిజమైన పుత్రునిగా

వారు సాధారణ మానవులు అనుసరించలేనంతగా ఐహిక స్థాయి నుండి ఉన్నత స్థితిని అందుకున్నారు. రామలింగ గురించి వర్ణించే టప్పుడు గౌతమ బుద్ధుని గురించి హస్టక్స్మిత్ వ్రాసిన మాకు మించి ఆదనంగా మరేమీ చెప్పలేము.

విశ్వకళ్యాణమునకై ధర్మస్థాపనయే అతని కర్తవ్యం అని బుద్ధుని జీవిత చరిత్ర అంతా ఒక విశ్వాసంతో పూర్తిగా నిండి వుంది ... స్తుతి, స్తోత్రం వీటికి

తోడు బుద్ధుని అనుయాయులకు మూలగ్రంధాలు, సూత్రాలు,

శ్రుతులు...మాటలు
ద్వార జరపవలసి నంత మేలు జరిపాక, వారి గురువు గారిలో మిగిలి
ఉన్నది.
లోతు తెలియని, ఊహకు అందని లోతు లోనుండుటచే మాటలతో
వ్యక్తం
చెయ్యలేని గుప్తజ్ఞానసారాంశం. వారికి బోధ పడినంత వరకు ప్రేమతో,
భక్తితో
పూజించారు. కాని పరిశోధన పూర్తిగావించినా ఇంకా ఎంతో ఉన్నది.
చివరి
దనుక వారు సగం భాగము తేజస్సు సగ భాగమూ ఛాయగా నుంచి
స్పష్టతను
ఎదురించి ఉండిపోయారు.

రామలింగ దయాగుణం గురించి ఒక పూర్తి అధ్యాయం ప్రత్యేకించడమైనది. బుద్ధుని గురించి ప్రస్తావిస్తూ హ్యూస్టన్ స్మిత్ ఇలా అన్నారు. "ఇటలీ దేశస్థులైన ఫ్రాన్సిస్ ప్రవక్త చూపిన ఆర్ద్రత ఎంత గాఢమైనదంటే వారి సందేశానికి 'అపారకరుణ గల మతం' అన్న ఉపనామం పెట్టవలసి వచ్చినదట. కరుణాత్మకమైన మానవత రామలింగలో శిఖర స్థాయి చేరుకున్నదని ఈ రచయితకు స్ఫురింపజేస్తోంది. వారు దానిని ప్రధానమైనదిగాను, ఆత్మ శోధన, పరమాత్మ స్వరూపం పొందే మార్గాలు రూపొందించారు. దీనిని వారు అతి మృదువైన, దృఢమైన యుక్తి యుక్తమైన ఇదివరకెన్నడూ వినలేని, తరువాత మరెప్పుడూ వినపడని వాదశక్తితో చెప్పారు. ముందు చెప్పినట్లు, వారి పద్యాలు ఉపన్యాసాలనుంచి, అసంఖ్యాకములైన వారి గ్రంథాలపుటలనుంచి ఎంచుకొని ఈ సందర్భంగా ఇక్కడ పొందుపరచుకొన వచ్చును.

ఇమ్మొక మానవుని కృపతో నిండుగా
సకల జీవులను. జీవి ఒకటే అనుచును
నేనాతని నా హృదయమునందుంచుకొందును
దేవుని వలె, మరి యాతని భృత్యుడనౌదును
ఆతని పరసన ఉన్నతునిగా నమ్ముంచునేమో.

ఇమ్మొక్క మానవుని తన జీవితము
ప్రతిజీవితోను తిలకించు వానిని రవంతయు వేరు గాక,
ఆ ఏకత్వముతోనుప్పొంగుచుండు వానిని వేముంచెద
అతని హృదయమును మాత్రము సర్వ
వ్యాప్తమునైన శక్తి నృత్యము చేయుచోటు
నేనాతని బానిసవాడ ఎల్లకాలము,
పరమాత్మకు బానిసనై పల్లుగా
ఇమ్మొక్క మానవుని కరుణయే పరమార్థమైన వానిని
జీవితమంతయును తనదిగా చూచుకొనువాతని,
పరమార్థ సత్యమువే వెలుగొందుచు
ఆతనికి సత్యపథకము నిచ్చుచుండును
అట్టి మహాత్ముని ఉంచుకొందును
నా ఆత్మలో, మరి అతని పలుకుల
పరమాత్ముని పలుకులు గనె ముద్రించెదను
వారి సందేశ సారాంశాన్ని యీ మాటలు దిఙ్మాత్రంగా మనకు అందిస్తున్నాయి.

# అధ్యాయం 14

# ఒక అద్భుతం, ఒకనీతి కధ, ఒక వాదన

రామలింగ కరుంగు జిల్లాలో ఉన్న కాలంలో ఒంటరిగా, విశాల ఆకాశం క్రింద ఒంటరి జీవితం గడపలేదు. వారి ఇల్లు రోడ్డు ప్రక్కగానే వుంది, వారి సన్నిహిత స్నేహితులు, తమ వారి బాధల ఉపశమనానికీ సలహా సంప్రదింపులకు వారిని సంప్రదిస్తూ వుండేవారు. ముందు ఉటంకించిన కొన్ని పద్యాలలో కొన్ని ఉదాహరణ చూడవచ్చును. సుదూరంలో నివసిస్తూ వుండేవారు కూడా తమ తమ నివాసాలను వదలి రామలింగ చెంత నుండడానికి వచ్చేసేవారు. వారి వారి యిళ్లల్లో ఉత్సవాలకు, సంగీత గోష్టులకు వీరిని ఆహ్వానించేవారు. ఇలాంటి ఆహ్వానాలు అంతలేకుండా వస్తూ వుండేవి. వీటిని వారు రామలింగ సేవకు ఆశీర్వచనంగా భావించారు వారిని ఒక పూజా విధాన చిహ్నంగాను, పురాణ పురుషులుగాను భావించేవారు. రోజులు తరబడి రేయింపగళ్లు ధ్యానంలో గడుపుతూ, పద్యాలు వ్రాస్తూ సభా భవనంలో గాని, ఇంట్లో గాని చీకటి పడిన తరువాత ప్రసంగాలు చేసేవారు, ప్రజలు వారి బోధలు వినడానికి గుమి కూడేవారు.

కరుంగుజి లో వెంకట రెడ్డి యార్ యింట్లో యింటి యజమానురాలు ముత్యాలమ్మాళ్ స్వయంగా గదిలో నూనె దీపాన్ని వెలిగించి, ప్రక్కనే తరిగిపోయినపుడు తిరిగి వేసుకోవడానికి వీలుగా ఒక మట్టి పాత్రలో నూనె ఉంచేవారు. ఒక రోజు మట్టి పాత్ర మూతి విరిగి పోవడం చేత, ఒక కొత్త పాత్ర తెచ్చాడు. నూనెతో నింపడానికి ముందు కుండను బాగా తడిపే ఉద్దేశంతో నీటితో నింపి దీపం పక్కన ఉంచారు. తరువాత వారు ప్రక్క గ్రామానికి వెళ్లారు. తరుచు రాత్రంతా తమ పద్యరచన కొనసాగిస్తూ దీపం ఆరిపోకుండా పాత కుండలోని నూనెకు బదులుగా కొత్త కుండలోని నీటిని పోస్తూ వచ్చారు. తెల్లవారుఝామున ముత్యాలమ్మాళ్ గ్రామం నించి తిరిగి వచ్చారు. రామలింగ తన పద్యరచనలో నిమగ్నులై ఉండడమూ, దీపం వెలుగుతూ వుండడమూ చూశారు. వారివల్ల ఇచ్ఛాపూర్వకంగా తెలిసి జరిగిన పొరపాటు కాదది కాని దీని ఫలితంగా ఒక

అద్భుతమైన లీల ప్రదర్శితమయింది. ఇది అనుశ్రుతంగా వినవస్తూన్న గాథ. వారి అలవాటు ప్రకారం యీ అనుభవాన్ని కూడా వారు ఒక పద్యంలో పేర్కొంటూ ఇది భగవంతుని లీల తప్ప, తమ శక్తుల వల్ల జరగిన చర్యగా చెప్పలేదు. గురువు గారిని స్తుతిస్తూ రాజాపూర్ వేలాయుధముదలి యార్, ముధురై చిదంబరస్వామి వారు కూడా యీ విషయం గురించి ప్రస్తావించారు. వారి మహత్యాలను గురించి ఎన్ని పుటలైనా నింపవచ్చును కాని ఆగాధలన్నీ చెప్పడం ప్రయాసతో కూడిన కార్యమవుతుంది.

ఆ రోజులలో గూడలూర్ అని పిలువబడే కడలూర్ వాసి అప్పాసామి చెట్టియార్ రామలింగ భక్తులలో ఒకరు. గురువుగారిని దర్శించడానికి కరుంగుజి వస్తూవుండేవారు. రామలింగ కటాక్షం వలన తమసోదరుని నాలుకపై వున్న చిన్న వ్రణాన్ని మాన్పింపగలిగినందుకు కృతజ్ఞతాపూర్వకంగా వారికి తవ ఆతిథ్యాన్ని అందించారు. 1866లో రామలింగ కడలూర్‌ని వారి యింట్లో కొద్ది మాసాలు గడిపారు.

ఒక రోజున చెట్టియార్‌ను చూడడానికి ఇద్దరు పండితులు వచ్చి, తీవ్రంగా ఒక వాదనలోకి దిగారు. కర్మ, ఇచ్ఛాశక్తి లేదా వారు భావించిన తీరులో భగవంతుని దయ, ఇచ్ఛాశక్తి అనునది వివాదాంశం. చాలాసేపు వాదించుకున్నాక ఒకరు 'భగవదనుగ్రహం లేనిదే-అణువైనా చలించదు' అన్న వాక్యాన్ని తన వాదానికి సూత్రంగా పేర్కొన్నారు. రెండవ వారు (ఈ దేహంలోని) ఆత్మ ఆజ్ఞాపించునట్లు (అది జరుగుతుంది)' అన్నారు. అలా వాదించుకుంటూనే వారిద్దరూ ఇంట్లోకి వెళ్ళారు. తమకు జ్ఞానవృద్ధి కలిగించరా' అని రామలింగ ను అడిగారు. రామలింగ వారికొక నీతి కథ చెప్పారు వారుచెప్పిన కథ ఇదీ –

శాస్త్రాలు, వేదాలు, స్మృతులు వీటిలో వున్న సూత్రాలు వ్యాఖ్యానాలు అందరికీ అందుబాటులో ఉండకపోవచ్చు. మీకు ఒక చిన్న కథచెబుతాను. ఒకానొకప్పుడు ఒక సన్యాసి దిగంబరంగా వీధుల్లో తిరుగుతున్నాడు. ఒక వ్యక్తి అతన్ని చూసి దేహంపై అతను చూపిస్తున్న వైరాగ్యానికి ఆశ్చర్యపోయి, ఒక అరటిపండు ఆ సన్యాసి చేతిలో వుంచాడు. మరొక వ్యక్తి స్త్రీలు తిరిగే చోట ఆ సన్యాసి దిగంబరుడై తిరుగుతున్నాడని కుపితుడై అతనిపై రాయి రువ్వాడు. మూడవ వ్యక్తి యీ దృశ్యం చూసి జాలిపడి ఆ ఇరువురు వ్యక్తులను, సన్యాసిని

వెంట బెట్టుకొని ఒక న్యాయాధిపతి దగ్గరకు వెళ్లాడు. 'ఈ మంచి మనిషి వారికి ఒక మంచి ఫలం ఇచ్చాడు. ఆ పెద్ద వ్యక్తి వారిని రాయితో కొట్టాడు. వారిరువురము ఒకరికొకరు సాక్ష్యంగా మీ వద్దకు తీసుకు వచ్చాను' అని చెప్పాడు. న్యాయాధిపతి సన్యాసిని 'మిమ్ములను ఎవరు కొట్టారు?' అని అడిగారు. 'నాకు అరటిపండు యిచ్చిన వ్యక్తి' అని సన్యాసి బదులు చెప్పాడు. తిరిగి న్యాయాధిపతి 'మీకు అరటి పండు ఎవరిచ్చారు?' అని ప్రశ్నించాడు. సన్యాసి 'నన్ను కొట్టిన వ్యక్తి' అని సమాధానం ఇచ్చాడు. 'వివరంగా చెప్పండి' అన్నారు న్యాయాధిపతి. 'అవును నన్ను ఇక్కడికి తీసుకు వచ్చిన వారే నన్ను రాయితో కొట్టారు.' అన్నాడు సన్యాసి. అంతకంటే వారి నుంచి వివరాలు రావని గ్రహించి న్యాయాధిపతి తమంత తామే నిర్ణయించి సన్యాసిని గాయపరచిన వ్యక్తికి శిక్ష విధించారు. ఈ విధంగా సన్యాస స్థితికి చేరుకున్న స్థితిలో వున్న వానికి తాను చేయు చేష్టలకు ఇవి, అవి అను భేదముండదు. అతను ప్రతి దానిని ప్రతి వ్యక్తిని పరమాత్మగానే ఎంచుతాడు. అణువును కూడా భగవంతుడు మాత్రమే కదుపుతాడు అన్న తలంపు అందుకు సంబంధించినదే. ఏకత్వ దృష్టిలో ఉండే వారికి అరటి పండు యిచ్చిన వ్యక్తి, రాయితో కొట్టిన వ్యక్తి, న్యాయాధిపతి దగ్గరకు తీసుకువెళ్ళిన వ్యక్తి సమానంగానే స్ఫురింపుతారు. 'ఈ చర్య నాది' యీ చర్య భగవంతునిది అని వారికి అనిపిస్తాయి.

ఇద్దరి వాదమూ కాదనలేదు గనుక ఇద్దరు పండితులూ తృప్తి చెందారు. కడ్డలూర్‌లో వున్న సమయంలోనే రామలింగ యాదృచ్ఛికంగా బ్రహ్మసమాజ నాయకులలో ఒకరిని కలుసుకోవడం వారితో చర్చించడం జరిగింది. ఆ చర్చను 'యథాతథ చర్చ' అని అలప్పాక్కం వ్రాసిన యన రెడ్డి యారే వ్రాసి భద్ర పరిచారు. వారు అచ్చు వేసిన గ్రంథానికి అదే పేరు పెట్టారు. సన్మార్గ మున్నేట్ర కజగం అంటే సన్మార్గ ప్రబోధం సంఘం వారు 1893లో దీన్ని అచ్చు వేశారు.

కడలూర్ సమీపంలో పున్నై నదీ తీరాన వున్న తిరుప్పాపులి యూర్ గ్రామంలో 16 జనవరి 1867న ఒక ఉత్సవంలో రామలింగ పాల్గొన్నారు. తన అనుయాయులుతో సహా బ్రహ్మ సమాజ అధిపతి శ్రీధర స్వామి నాయకర్ కూడా అక్కడే వున్నారు. ఆ ప్రాంత ప్రజలువారి ప్రసంగాలు అంతకు ముందు చాలా సార్లు విన్నారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుందామన్న ఉద్దేశంతో రామలింగ దగ్గరకు వెళ్ళి 'విగ్రహారాధన మానవలెనని, ధ్యానానికి

తుల్యమైనది బ్రహ్మమే' అని శ్రీధరస్వామి నాయకర్ వారందరని ఉద్బోధించారనీ చెప్పారు. బ్రహ్మ తత్వం గురించి తెలుసుకోవడం మొదలు పెట్టిన వారు ఇంకా ముందుకు సాగాలి, విగ్రహారాధన చేయడం ప్రారంభించిన వారు కూడా అదే విధంగా ముందుకు సాగాలి. వారి వారి స్థాయిలలో ఇరువురూ కూడా సరిగ్గానే వున్నారు. అని రామలింగ ముక్తసరిగా చెప్పారు.

అక్కడ చేరిన జనంలో కొందరు నాయకర్ వైపు తిరిగి 'దయచేసి మీ అభిప్రాయం కూడా చెప్పి, దాన్ని సమర్థించవలసింది' గా ప్రార్థించారు.

నాయకర్ అయిష్టత వ్యక్తం చేశారు. ఈ విషయం రామలింగకు, తనకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పరిష్కరించుకోవడం తనకు బాగుందని తోస్తోంది అన్నారు. కాని ప్రేక్షకులు గాని, రామలింగగాని ఇలాగా తప్పించుకోవడం ఎంత మాత్రమూ నచ్చలేదు.

ఇంక బయట పడ్డాక చేసేదిలేక నాయకర్ ఇలా అన్నారు. "విగ్రహాలను పూజించడం వ్యర్థం, అది పసితనం చేష్టలాగ తోస్తుంది. అసలైన ధ్యానానికిసరియైనది ఆ బ్రహ్మ స్వరూపమే. అది శాశ్వతం, నిరాకారం, నిర్మలం, అవ్యక్తం, మాటకు ఊహకు అందనిది. ఇదే మా బ్రహ్మ సమాజంలో బోధించేది.

'ఆ పర బ్రహ్మ మాటకు, ఊహకు అందని దైతే మనసు దానిని ఎలా గ్రహిస్తుంది! ఆకాశాన్ని చేతిలో కొలవ వచ్చు, గాలిని పిడికిలితో పట్టవచ్చు అన్నట్లు గానే వుంది ఇది. ఊహించడానికైతే ఇది బాగానే వుంది గాని, ఇది కార్యరూపంలో పనిచెయ్యదు ' అన్నారు రామలింగ.

'నా ఉద్దేశం ఏమిటంటే ప్రకృతిలో మామూలుగా మనం అందుకొనే వస్తువుల్లాగ ఆపర బ్రహ్మన్ని మనసు అందుకోలేక పోయినా 'పరబ్రహ్మ గురించి ధ్యానం చెయ్యవచ్చును గదా!"

ఏదేనా వస్తువు స్వల్ప భాగాలు గానైనా మనసు ద్వారా గ్రహించడానికి, ఇలా ఉంటుందని ఊహించడానికి తావిచ్చినట్లయితే క్రమంగా కొద్ది కొద్దిగా గ్రహించుచూ చివరకు సంపూర్ణంగా గ్రహించ వచ్చును కదా. కొంత భాగాన్ని మాత్రమే ఊహించి నిర్వచించగలమని చెప్పలేము కదా. అది మాటలకూ, ఊహలకు అతీతమైనా వుండాలి, కాకుండానైనా అయివుండాలి. ఇంకా, మనసు ఒక విషయాన్ని కొంత వరకూ గ్రహించిందంటే, తక్కిన జ్ఞానేంద్రియాలు కూడా అంతే, దృష్టి, శ్రవణం,

ఘ్రాణ, రుచి, స్పర్శ మరి అవన్నీ గ్రహింపగలిగినప్పుడు బ్రహ్మత్వానికి ఇది వ్యతిరేకంగా ఉన్నది కదా? మనసునుగురించిన ప్రసక్తిపూర్తిగా తొలగిస్తేనే బ్రహ్మ స్వరూపాను భవం కలుగుతుంది. మనసు మెల్లిగా వెనుకనించి అడుగు పెట్టేసరికి, ఆ జ్ఞానం మళ్ళీ అదే బ్రహ్మస్వరూపానుభవం మాయమవుతుంది. మనస్సు, బ్రహ్మం, విభిన్న ప్రకృతులు గలవి. మనసు పదార్థంతో కూడినది. స్వయం పోషకం, అదిగతించునది, భూతల మాలిన్యాలతో గూడినది, దుఃఖానికి కారణభూతమైనది. పరబ్రహ్మ చైతన్య స్వరూపం జ్ఞానం. సమస్త పదార్థాలకూ అతీతమై ఉన్నది. అదే బ్రహ్మానందం. కనుకమనస్సు పరబ్రహ్మాన్ని ఊహించలేదు. దానిపై ధ్యానాన్ని నిలుపలేదు. దీనిని వేదాలు, పెద్దల వాక్కులు కూడా అంగీకరిస్తున్నాయి. ' అన్నారు రామలింగ.

నాయకర్ మౌనంగా వుండి పోయారు. శ్రోతలు తరచి తరచి అడుగగా వారు తిరిగి 'మనసు పరబ్రహ్మమును గురించి చింతించ వచ్చును' అన్నారు

'అలాంటప్పుడు కళ్లు పరబ్రహ్మమును చూడవచ్చును, తక్కిన ఇంద్రియాలు కూడా వాటి వాటి హద్దులలో పరబ్రహ్మాన్ని కనుగొనవచ్చును."

అంటే దాని అర్థం మనసు ఒక విషయాన్ని ఊహా మాత్రంగా గ్రహించగలిగితే, కళ్లు దానిని చూసి తీరాలా?" అని నాయకర్ అడిగారు.

'అవును" అని సమాధానం యిచ్చారు రామలింగ.

మనస్సుతో ఊహించేది, తక్కిన ఇంద్రియాలతో కనుగొనలేనిదీ ఏదీ లేదా?"

"మీరే చెప్పాలి" అన్నారు రామలింగ

"బ్రహ్మానందం"

'మరి ఆ సందర్భంలో తక్కిన ఇంద్రియాలు మనస్సుకు బ్రహ్మానందాన్ని అందచేయగలవు' అన్నారు రామలింగ. కనులతో వీక్షించిన బ్రహ్మానందం, చెవులతో విన్నదీ, తక్కిన ఇంద్రియాలతో అనుభవించినది మన ఋషులు అంగీకరించారు కానీ ఇంద్రియాలు దైహిక సాధనాలు, మనసు దైహిక వాంచలను, ఆనందాలను అనుభవించుటకే కాని బ్రహ్మానందం ఆత్మకు సంబంధమైనది కనుక దానిని జ్ఞానం ద్వారా మాత్రమే సముపార్జించవలసి ఉంది.'

కొంత మంది పండితులు శ్రోతల నుంచి లేచి 'అంటే పరబ్రహ్మ స్వరూపాన్ని మనస్సు ఊహించలేదా?" అని ప్రశ్నించారు.

'లేదు. పరబ్రహ్మం యీ మాయా జగత్తుకు అతీతమైనదీ; మనస్సు మాయా జగత్తుకు చెందినదీ కావడమే దీనికి కారణం'.

"మరి పరబ్రహ్మ స్వరూపం గురించి అసలు మనం ఎలా మాట్లాడుతాం?" అని వారు తిరిగి ప్రశ్నించారు.

"పరబ్రహ్మాన్ని ఆత్మ జ్ఞానం లేదా ఆత్మానుభవం ద్వారా కూడా తెలుసుకోగలుగుతాం. ఆత్మకు తనంత తెలుసు. "అన్నారు రామలింగ.

అప్పుడుజనం వైపు తిరిగి రామలింగ యింకా యిలా అన్నారు. 'మనసుకు తగిన రీతిని మొదట్లో విగ్రహారాధన చేస్తేనే గాని జీవి ఆత్మానుభవం పొందలేడు. 'విగ్రహం' అంటే ప్రత్యేక నివాసం. ఆత్మలకు సాధారణమైన నివాసాలు మానవ శరీరాలు, ఇతర జీవరాసుల శరీరాలు, జ్ఞాన తేజస్సుకు ప్రతీకలుగా బ్రహ్మ స్వరూప తేజస్సు ఉండడానికి విగ్రహమూర్తులే నివాసాలు. విగ్రహారాధన ఈ విధంగా చేసి పరబ్రహ్మాన్ని చేరుకొన వచ్చును అన్న సత్యాన్ని నిరూపించి బ్రహ్మ కైవల్యము సాధించినవారు, ఎన్నో మానవాతీత శక్తులను సంపాదించివ్యాధులను నయం చేసి, చనిపోయిన వారికి ప్రాణదానం చేశారు. ఇలాంటిపనులెన్నో చేశారు

అని చెప్పి రామలింగ వెళ్లి పోయారు.

నిజమైన సూక్ష్మ దృష్టి నించే అత్యున్నత భావాలు ఉత్పన్నమవుతాయి అన్న సత్యాన్ని మరచి విగ్రహాలంటే రాళ్లుకాక మరేమిటి? ఆలయాలంటే శిలలుగాక మరేమిటి? అంటూ విగ్రహారాధన, సర్వ వ్యాపకుడైన పరమేశ్వరుని సంకుచితపరుస్తుందని నాగరిక ప్రపంచంలో ప్రబలి వున్న చవుకబారు జ్ఞాన బోధనలను రామలింగ గట్టిగా ఖండించారు. వారి దృష్టిలో వాదించడానికి ఇది బాగానే వుంటుందిగాని ఆచరణలో పని చెయ్యదు. వారు ఇంకొక అడుగు ముందుకు వెళ్లారు కూడా. విగ్రహారాధన అక్కరలేదు అనుకొనే వారికి కూడా ప్రధమ దశలోవిగ్రహారాధన అవసరమే. ఈ దశను అనుభవించకుండా అంతిమ అనుభవం సాధించడానికి వీలు పడదు. మానవాళి ఆరాధించి పూజించే జీసస్, బుద్ధుడు మొదలైన దివ్యపురుషులను కూడా పరబ్రహ్మ స్వరూపానికి ప్రతీకలుగా ఎంచాలి దేవమల్లా ఒకటే ఆవిగ్రహాలు నిర్జీవాలు. వారి ప్రసంగాలలో ఒక దానిలో (పుట 98, 2వ భాగం, పద్య సంపుటి 11) వారు యిలా వివరంగా చెప్పారు.

ఒక ప్రత్యేక రూపంపై తప్ప ధ్యానం చెయ్యడం సాధ్యం కాదు. దైవత్వం

యొక్క పరిపూర్ణత మీదనే ప్రథమ దశలో అది సాధ్యం కాదు. అది తప్పకుండా ఒక ఆకారం, విగ్రహం అయి తీరాలి. అంతేగాని నిరాకారం మీద తొలినాళ్లలో సాధ్యపడదు. తరువాత ఆ ఆకారం నిరాకారంలోకి లీనమైపోతుంది. ద్వైతం యొక్క అత్యున్నత స్థాయి ద్వైతం కానిది. దాని విధం ఇట్టిది. పూజించే వ్యక్తి ఉనికి విడచితే అది ద్వైతం కానిది. ఆకారం ఉనికిని పోగొట్టుకొంటే అదే అతీతస్థాయి ప్రవేశం.

గమనిక : తమ స్వానుభవం నుండి యిచ్చిన రామలింగ ఈ సలహాకు ఉపనిషత్తులలో ఆధారం ఉన్నది. ముండకోపనిషత్తు 3, ఖండం 2, శ్లో 3) :

నాయమాత్మా బలహీనేన ల భ్యోన చ ప్రమాదాత్త పసో వాప్య లింగాత్।
ఏ తైరుపాయైర్య తతే యస్తు విద్వాంస్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ॥

ఆత్మ పరిశుద్ధ అన్వేషిక జీవిక నుండి జనించినది గనుక, బలహీనులకు యీ ఆత్మను చేరుకోవడం సాధ్యం కాదు. అలాగే కారణ రహితంగా, ఆకార రహితంగా చేసిన తపస్సు వల్ల కూడా సాధ్యం కాదు. వీటన్నిటినీ అతి నేర్పుతో ఎవరైతే వినియోగిస్తారో వారి ఆత్మ పర బ్రహ్మ వస్థను చేరుకుంటుంది.

(ఆంగ్లాను వాదకులు చేసిన అనువాదం)

ఉపనిషత్తులలో చెప్పినదీ, రామలింగ చెప్పినదీ, ఒకటిగా వున్నాయి. ముండక, మాండూక్య ఉపనిషత్తులు పుట 67 స్వామి సర్వానంద, శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్, మద్రాసు వారు 1932లో ముద్రించారు. దీనిలో శంకరులు 'అలింగాత్' అన్నమాటకు ఒక శ్లోకంలో 'సన్యాసాశ్రమానికి సరియైన గురుతు దిక్కులేనివాడు' అని వివరించారు. అంటే అతిసూక్ష్మంగా నమ్మిక కుదరని చుట్టు తిరుగుడు వ్యాఖ్యానాలు వదిలితే, యీ మాటకు క్లుప్తమైన అర్థం 'ఆకారంలేని' అని అంతేకాక, తమ సుదీర్ఘ వ్యాఖ్యలో ఇమిడేలాగ శంకరులు 'తపస్సు' అన్నమాటకు కూడా విజ్ఞానం అని అర్థం చెబుతూ ఆ విధంగా పూర్తి పాదానికి 'సన్యాసావస్థ లేనిదే ఆత్మను జ్ఞానంతో సంపాదించలేము' అని వివరించారు. స్వామి సర్వానంద వంటి కొందరు ఈ విషయాన్ని విడిచిపెట్టి యీ మాటలకు 'సరియైన నిష్ఠా నియమములేనిదే' అనిగాని 'యుక్తంకాని నిష్ఠా నియమములతో' అని వ్యాఖ్యానించారు. టి.ఎం.పి. మహాదేవన్‌కూడా 'అలింగాత్' అన్న పదాన్ని కొంచెం మెరుగులు దిద్ది 'లక్ష్యము లేకుండ' అని తమ అనువాదంలో పేర్కొన్నారు. ఆంగ్లానువాద సహితం

ఉపనిషత్తులు, ప్రచురణ : జి.ఎ.నటేశన్ ఎండ్ కంపెనీ మద్రాసు 1950, పుట 114) జ్ఞానుల ఉన్నతమైన తాత్వికమైన ఆలోచనలు కలిగినప్పటికీ, ప్రాథమిక దశలో విగ్రహారాధనద్వారా నియమబద్ధులైతే తప్ప పరబ్రహ్మాన్ని లేదా పరమాత్ముని చేరలేదు. ఇది వేద వాక్కులలోని సారాంశం. ఈ రచయిత అభిప్రాయంలో వేదాలలో పేర్కొన్న దాని అర్థం రామలింగ తన స్వానుభవంవల్ల చేసిన ప్రకటనతో పరిపోలుచున్నది.

రామలింగ అవలంబించిన మార్గం కేనోపనిషత్తులో యీ విధంగా చెప్పబడింది.

(ఖండం I., శ్లో. 5, 6, 7)

మనసుచే తెలుసుకొనబడనిదియు, కాని
మనసును తెలిసికొనగలిగినదియు, అదియే ఎరుంగుము
బ్రహ్మము, అంతియేకాని ఇచట పూజించునదికాదు

కనులతో చూడలేనిది, కాని కనులను
చూచెడిదియు, అది యే ఎరుంగు బ్రహ్మము
అంతియెకాని, ఇచట పూజించునది కాదు.
చెవులతో వినలేనిది, కాని చెవులను
వినునదియు, అదియే ఎరుంగుము బ్రహ్మము
అంతియేకాని, ఇచట పూజించునదికాదు.

## అధ్యాయం 15

# ధర్మప్రచార కర్తవ్య విస్తరణ

కరుంగుజిలో గడిపిన చివరి సంవత్సరాలలో సన్మార్గ సంఘం స్థాపించిన తరువాత జీవితంలో తమ కర్తవ్య నిర్వహణకు సంసిద్ధులై యున్నట్లు రామలింగ భావించినట్లు అనిపిస్తుంది. ఉత్తేజితులైన ప్రవక్త చెప్పినట్లు మాట్లాడేవారు, వారి కర్తవ్యాన్ని భగవత్ప్రేరితంగాను, వారు భగవదంశలో జీవిస్తున్నట్లుగాను భావిస్తున్నారు.

ఈ భువిపై నిండియున్న మానవుల బ్రోవ,
తెలుపు నలుపు వర్ణములు, లో, వెలుపల నుండి లేక,
వారిని తీరిచిదిద్ది తిరిగి వారిని ఉన్నత శోధనా
మార్గమున బెట్ట, వారు, పొందుదురు
ఆత్మ విధికృత సిద్ధి తరువాతిది. ఇక్కడే, ఇప్పుడే
ఈ భువిపై, పొందునట్లు స్వామినన్నీ భువిపై కనిపె,
అందులకు నన్నాతడు ఆశీర్వదించెవాతని కటాక్షము చే.

వారి ఆదేశాన్ని ఇంకా స్పష్టంగా చెప్పారు ఇలా –

నీ చూపులు మార్గమున చూడవు దేనిని,
నీ చెవులు వినని యే చిన్న శబ్దమును,
నీ చదువులు బ్రద్దలవు, నీ యానందము భ్రాంతియే,
నీ దేహము క్రుళ్ళిన తిండిపై పోషింపబడు,నీ మనసు పక్షపాతముపైన,
ఈ లోకపు మానవులారా, సత్యమును జారవిడచినారు.
వర్తమానము వినుడీ, మరలండి సహజమైన అంతిమమార్గము
సత్యశోధకులు వెదికెడిది, ఆయన కటాక్షము నర్థించండి,
ఆయన సర్వవ్యాపకుడు, అణురూపుడు, మీరు కూడ
దేహమునందు మృత్యువును జయించు జీవము పొంది ఆనందించండి.

మళ్ళీ ఇలా అన్నారు :

ఆ ప్రభువు చెప్పినదే నేను తిరిగి చెపుతున్నాను,
హెచ్చించిగాని, తగ్గించిగాని, మాటలు లేవు-
వాస్తవముగ, నా అంతట, నాకేమి జ్ఞాపకము కలదు
ఆ దైవమిచ్చునదిగాక మరి?

1865లో సన్మార్గ సంఘం స్థాపించిన తరువాత కరుంగుజిలో రెండు సంవత్సరాలు గడిపారు. ఆ కాలంలో చుట్టుపట్ల ప్రదేశాలు అప్పుడప్పుడు దర్శించేవారు. అట్టి సందర్భాలలో కడ్డలూర్ వెళ్ళడం తటస్థించింది. అప్పుడు తన అనుచరులతో, జాతి, మత, దేశ వివక్షత లేకుండా అందరికీ ఉచితంగా భోజనం పెట్టే ఒక ఉచిత భోజనశాల స్థాపిద్దామని ఉద్దేశ్యం వుందన్న అభిప్రాయం వెలిబుచ్చారు. (వారు అచ్చువేసిన చిన్న నీతి పుస్తకంలో దయా వితరణకు యివన్నీ అర్థంలేనివని గట్టిగా చెప్పారు) అల్లాంటి గృహం ప్రారంభించడానికి అనువైన చాలా ప్రదేశాలను వారందరూ చూపించారు. చివరకు వళ్లార్(రామలింగను గౌరవసూచకంగా సంబోధిస్తూంటారు) ఆయనంతట ఆయనే వడలూర్‌కు ఉత్తరాన, చిదంబరానికి ముప్పై కిలోమీటర్ల దూరంలోవున్న పార్వతీపురం అనే గ్రామం దగ్గర పెద్ద మైదానాన్ని ఎంపిక చేశారు. ఆ మైదానం రెండు ప్రధాన రహదారులకు కూడలి, మద్రాసునుండి కుంభకోణంపోయే రోడ్డు, మంజాకుప్పంనుండి విరుద్ధాచలం పోయే రోడ్డు ఆ మైదానం విస్తీర్ణం నూట ఎనిమిది ఎకరాలు. ఈ విషయాన్ని తెలుసుకున్న భూమి యజమానులు అంతా కలిసి మొత్తం నలభై సంతకాలు చేసి 2 ఫిబ్రవరి 1867న దాన పట్టాక్రింద వారికి యిచ్చారు మట్టితో తాత్కాలికంగా రెల్లుగడ్డిపై కప్పుతో ఒక ఇల్లు కట్టారు.

తాత్కాలికంగా కట్టిన పాకలలో అన్నదానం, శాశ్వత భవన నిర్మాణం, నుయ్యి త్రవ్వకం, గుంట, మందిరానికి చెఱువు వీటన్నిటికీ శాస్త్రోక్తంగా ప్రారంభోత్సవం ఆనాడే జరిగింది. అచ్చువేసిన ఆహ్వానపత్రాలు ఒక వేయిదాకా ప్రజలకు పంచిపెట్టారు. రామలింగ స్వయంగా వ్రాసిన ఆహ్వానపత్రాలు సాధువులకు, సన్యాసులకు ఇచ్చారు. రోజుకు వెయ్యి ఆరువందలమంది చొప్పున మూడు సంవత్సరాల వరకూ అన్నదానం సాగిందట. అక్కడికి వచ్చిన వారికి లేదనకుండా క్షుధాపిపాసులకు ఇప్పటికీ కూడా రోజూ భోజనం దొరుకుతుందిట

అన్నదాన సత్రం ప్రారంభోత్సవం 23 మే 1867న జరిగినప్పుడు చిదంబరం వెంకటసుబ్బదీక్షితర్ రామలింగ వ్రాసిన జీవకారుణ్య ఒజుక్కం (జీవకారుణ్యనీతి) అన్న చిన్నపుస్తకం నించి కొన్ని భాగాలను చదివారు. రామలింగమతంలోని అతిప్రముఖమైనసిద్ధాంతం జీవులపై దయ ఇది మానవునికి భగవంతునివైపు దారిచూపుతుంది అంటారు వారు కారుణ్యంలో రెండు అంశాలు ఉన్నాయని వారు చెప్పారు. ఒకటి జీవహింస మాని, మాంసాహారం వర్జించటం, ఆకలి తీర్చటం, కారుణ్యంమీద వారి చిన్న పుస్తకం యీ రెండు అంశాలనూ విశదీకరిస్తూ అత్యున్నత శిఖరాలనందుకుంటూ అతి తీవ్రంగా, అతి కట్టుబాట్లలోవున్న శబ్ద చాతుర్యంతో కూడి వున్నది

అన్నదాన సత్రానికి సమరస వేదధర్మశాల అని పేరుపెట్టారు వారు తమిళంలో సత్రం అంటారు. కాని యీ 'సత్రం' అన్న శబ్దం చాలా నీచమైన సామ్యాలతో జతగూడి ఉండడంచేత వారు 'శాల' అంటే 'గృహం' అన్న అర్థం వచ్చే మాటను ఎంచుకున్నారు ఈ పేరును వారు తరువాత సమరస శుద్ధ సన్మార్గ సత్య ధర్మశాల లేదా సత్యధర్మశాల అని మార్చారు

అదే సంవత్సరం వారు ఒక పాఠశాలను స్థాపించారు 'సన్మార్గబోధిని' అన్న పేరుతో దాని ప్రత్యేకత ఏమిటంటే అందులో అందరూ చేరవచ్చు వయసుతో నిమిత్తంలేదు. బాలురు, వృద్ధులూకూడా, మూడు భాషలు అక్కడ నేర్పబడతాయి. వరుసగా తమిళం, సంస్కృతం, ఆంగ్లం, తమిళ, సంస్కృతాల్లో పండితుడూ ఆంగ్లంలో దిట్ట అయిన తొజువూర్ వేలాయుధ మదలియార్ ఈ పాఠశాలకు అధిపతిగా ఉండేవారు.

ఇదే సమయంలో రామలింగ 'సన్మార్గ వివేకవృద్ది' అనే మాసపత్రిక కూడా తెద్దామని సంకల్పించారు దానిని గురించి వివరణ పత్రం వెలువరించారు అందులో కాదర్ సాహెబ్ అనే మహమ్మదీయునితో కలిపి నలభై తొమ్మండుగురు యీ పత్రిక వెలువరించుటలో సహాయపడుతామని సంతకాలు చేశారు కాని యీ పత్రిక బయటికిరాలేదు

# అధ్యాయము 16

# వడలూర్ లో

1867లో ఉచిత భోజనశాల ప్రారంభించాక రామలింగ తమ నివాసం కురుంగుజినించి వడలూర్‌కు మార్చారు. ఆ ఉచిత భోజనశాల వారి నివాసంగాను, వారి కార్యకలాపాలకు కేంద్రంగాను రూపొందింది. సంఘానికి కేంద్ర కార్యాలయం పూజాస్థలంగానూ అయింది. సాయంత్రం వేళల్లో ఉపన్యాసాలిస్తూ ఉండేవారు. చుట్టుపట్ల గ్రామాల నుండి ప్రజలు వారి దర్శనానికీ, వారి ఉపన్యాసాలు వినడానికీ, వారి దీవెనలు అందుకోవడానికీ, కష్టాలలోనూ, బాధలలోనూ వారి సలహాలను తీసుకోవడానికి తండోపతండాలుగా వచ్చేవారు.

అప్పాసామి చెట్టియార్, మరి కొంతమంది శిష్యులు కలసి ఉచిత భోజనశాల నడిపేవారు. దినుసులు అయిపోయినప్పుడు వారు రామలింగకు చెప్పేవారు. రామలింగ వారికి ఉదయానికి మీకు కావలసినవన్నీ సమకూరుతాయి అనే వారు అలాగే ఉదయానికల్లా బళ్ల మీద బియ్యం, పప్పులు, తక్కిన అవసరమైన కూరలు, వస్తువులూ వచ్చి చేరేవి.

ఈ రోజులలోనే వారికి భగవద్దర్శనం అయినట్లు చెబుతారు. ఆ విచిత్ర పరిస్థితిని వర్ణిస్తూన్న కొన్ని పద్యాలలో అందుకు సంబంధించిన ఒక సంచలన రూపరేఖమనకు గోచరమవుతుంది.

ఆ రాత్రి జ్ఞప్తికి వచ్చునాకు,
నా వొంటి నున్న వస్త్రము తొలగించి
దానిని నేలపై పరచి
ఇంటి ప్రక్క ఆరు బయటినే పరుండి
నిదురించితిని కలత నిదుర
నీ వపుడు వచ్చి నీచేతుల తో గైకొంటివి నన్ను
'భయమెందుకు బాబూ' అనుచు గొని పోతివి

ఎటకో, హసియించుచు జగదీశ్వరా ప్రభూ,
నా కొసగితివి దివ్యశక్తుల బహుమతిగా—
తండ్రీ, నా పాటను అందుకొనుము.

మరికొన్ని పద్యాలలో, పలుమార్లు తనకు ఉచిత భోజనశాలలోనే భగవద్దర్శనమైనదనీ, ఒకసారి దర్శనమిచ్చినప్పుడు ఎన్ని జన్మలు కోరిననో గాని లభింపని కటాక్షం, శక్తులూ, ప్రసాదించెనని చెప్పారు

ఉచిత భోజనశాలలో జనసంఖ్య పెరగడం మొదలుపెట్టింది. వారి దర్శనానికి కూడా జనులు తండోపతండాలుగా రావడం ఆరంభించారు. ఈ సమయంలో వారు వీటి నుండి స్వేచ్ఛగా, తమను యింకా దృఢతరం చేసుకొని ఏ కాంతంలో ధ్యానం చేస్తూ అదే సమయంలో తమ సందేశాన్ని బోధనలను ప్రజలకు అందజేయాలని సంకల్పించారు. వడలూర్‌కు దక్షిణంగా మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న మెట్టుకుప్పం వారు అప్పుడప్పుడు వెళుతూ ఉండేవారు అక్కడి ప్రజలు తమ మధ్య కొంతకాలం ఉండమని రామలింగను ప్రార్థించగా వారు అంగీకరించి ఆతిధ్యాన్ని స్వీకరించారు

నాలుగు సంవత్సరాలు వడలూర్‌లో గడిపిన తరువాత, రామలింగ మెట్టుకుప్పానికి తమ నివాసం మార్చారు. వారివాసాన్ని వైష్ణవ మత గురువులు అప్పుడప్పుడు వుంటూ చాలాకాలం నించీ శిధిలావస్థలో వున్న ఒక యింట్లో ఏర్పాటు చేశారు అది చాలా చిన్నయిల్లు, ఒకే గది వుంది దానిలో వారు దానిని మోక్షగృహం (సిద్ధివిలక్కం) అని పిలిచే వారు, అందులోనే వుంటూ వుండేవారు. మెట్టుకుప్పంలో వుంటూ యోగాభ్యాసం, నిగూఢ ధ్యానం చేస్తూ కూడా ప్రపంచానికి తాను అందించవలసిన సందేశం, ధర్మప్రచార కర్తవ్యం మరచిపోలేదు. ప్రతిరోజూ వడలూర్‌కు వెళ్ళి అక్కడ ప్రారంభించిన పని విజయవంతమయ్యేలాగ పర్యవేక్షిస్తూండేవారు.

ఉచిత భోజన శాలకు ప్రక్కగా ఒక ఏభై ఎకరాల మైదానాన్ని ఎంచుకున్నారు. దానికి ఉత్తర జ్ఞాన చిదంబరం అని పేరుపెట్టారు. అష్టాస్ర ఆకృతిలో వారు ఊహించిన ఒక మందిరానికి చిత్తురేఖా చిత్రాన్ని ఒకటి గీశారు. శిష్యులకు యిచ్చి ఆ మందిరం కట్టమన్నారు. నిర్మాణం 1871లో ప్రారంభమయింది. మెట్టుపాలెంలోనే వుంటూ వడలూర్ వచ్చిపోతూ భోజనశాలనూ, మందిర

నిర్మాణాన్నీ పర్యవేక్షిస్తూ అవసరమైనపుడు యీ పథకాలలో సలహా సంప్రదింపులను అందిస్తూ, ఇతర ఆధ్యాత్మిక సంబంధమైన సలహాలను, సంఘ ప్రవర్తనా నియమాలను గురించి చెబుతూ వుండేవారు.

ఈ మందిర నిర్మాణంలోనేకాక దానికి వారు పెట్టిన పేరులో కూడా పరిపూర్ణత ఉండాలనీ అది లోపరహితంగా ఉండాలని వారు ఆకాంక్షించేవారు. వారు దానిని కోవెల అనిగాని, ఆలయం అనిగాని అనలేదు దానిని వారు 'సభ' అన్నారు. పూర్తిపేరు సమరసశుద్ధ సన్మార్గ సత్యజ్ఞాన సభ లేదా క్లుప్తంగా సత్యజ్ఞాన సభ. మత సంబంధమైన అన్ని విషయాలను వదిలివేయాలని వారి ఉద్దేశం. ఉజ్జ్వలకాంతికి ప్రతీకగా వెలసింది ఆ భవనమంతా,.సత్యమందిరం అష్టకోణాకృతిలోవుంది దాని లోపల మళ్ళీ పన్నెండు స్థంభాల సభామందిరం, దానిలోపల మళ్ళీ నాలుగు స్తంభాల చిన్నమందిరం, దానిలో దివ్యకటాక్ష జ్యోతి జ్ఞానం అనే తిన్నెమీద వెలుగొందుతూ వుంటుంది పవిత్రం గావించబడిన ఒక అద్దం నాలుగు అడుగుల పొడవునవున్నది ఆ దివ్యకటాక్షజ్యోతి ప్రతిఫలించడానికి, ఆత్మజ్ఞానానికి నమూనాగా ఉంచబడింది. ఏడు వివిధ రంగుల తెరలు మాయాజగత్తులోవున్న ఏడు మిధ్యలు ఏడుస్థాయిలలో (మానవునిలోని తేజాన్ని మరుగుపరచేవి) సూచించునవి, వీనిని జ్ఞానం, కటాక్షంద్వారా ఛేదించుకుపోవాలి. ఈ తెరలు ఒకదాని వెనుక ఒకటి వ్రేలాడ గట్టబడి ఉన్నాయి. అక్కడ ప్రతి మందిరం, ప్రతి ద్వారం, ప్రతి కిటికీ, ప్రతి స్తంభము, ప్రతి కమాను, ప్రతి మెట్టు, ఉత్తరం, దక్షిణం, తూర్పు, పడమర, చుట్టూ ఆవరణ, ప్రతి కర్రపలక, గొలుసు, ఇవన్నీ సంజ్ఞా సూచకాలైన ప్రాముఖ్యత వున్నవే.

ఆ మందిరం 25 జనవరి 1872న తెరువబడింది. ప్రారంభోత్సవానికి రామలింగ లేరు. వారు తమ అలౌకిక ఆత్మ పరిశోధనలో నిమగ్నులై ఉన్నప్పటికీ, వారు తెలుసుకొనిన ఆనంద పారవశ్యాన్ని ప్రజలు కూడా రుచి చూడాలని వారు చాలా ఉత్సుకులై ఉన్నారు సభా భవన ప్రారంభోత్సవ సమయంలో వెలువరచిన ఒక ప్రకటనలో, వారు ప్రజలను ఉద్దేశించి ఒక పిలుపునిచ్చేరు. అది వారు స్వయంగా సాధించిన సత్యాలతో మారుమ్రోగుతూ వుంది అందులోని ప్రారంభ పంక్తులిలా వున్నాయి :

మానవులుగా జన్మించే అరుదైన అవకాశం లభించిన మిత్రులకు
ఇన్నాళ్ళ నా పరిశ్రమ ఫలితంగా ఈనాటివరకూ నాకు తెలియని,
అది యిట్లుండునని తెలియని జ్ఞానం, నేనూహించనటువంటి గుణాలు
మానవుల పరిధికి అందని శక్తులు, అనుభవానికి అతీతమైన అను
భవాలు, ఇవన్నీ యీ క్షణాన పొందుతున్నానని నేను తెలుసుకున్నాను
పరవశమొందాను. ఈ ఆనంద పారవశ్యం మీరు కూడా సమంగా పొందాలని
ఆశిస్తున్నాను. శుద్ధ సన్మార్గంయొక్క చివరి లక్ష్యం అదే ఆత్మయొక్క
విశ్వవ్యాప్త
మైన ఏకత్వం అని గుర్తించానన్న విషయం, ఉప్పొంగుతున్న ఆనందం, నన్ను
పరవ
శుణ్ణి చేస్తున్నది. నా ఆనందాన్ని మీకు తెలియజెప్పి మీరు కూడా నావలెనే
దానిని సాధించవలెనన్న భావం నన్ను ప్రేరేపించుచున్నది.

ఆ సభలో అర్చన విధానం అద్వితీయమైనది. అన్నిరకాల జాతులు, మతాలు, కులాలు, తెగలు, నమ్మకాలు ఉన్నవారికే ప్రవేశం వుంది. ఒకేఒక్క నిషేధం వుంది మాంసాహారులు మాత్రం ప్రధాన మందిరంలో ప్రవేశించరాదు బయటినుంచి వ రు పూజలు చేయవచ్చు. సభ లోపలకు ఎవరూ పూజలకు రాకూడదు ప్రత్యేకమైన సందర్భాలలో - ఊడ్చడానికీ, పరిశుభ్రంచేసి దుమ్ము దులపడానికీ, దీపం వెలిగించడానికీ, దీపంలో నూనె అయిపోతే వెయ్యడానికి మాత్రం అందుకు నియమించబడ్డ కొద్దిమందిలో ఒకరు లోపలికి ప్రవేశించవచ్చు. మాంసాహారంతో తమ దేహాలను పెంచుకోనివారు, జీవహింస చేయనివారు, కామక్రోధాది వాంఛలకు అతీతులైనవారు, జాతి మత విభేదాలకు దూరంగా వుండేవారు, ఇలాంటి వారినే ఎంచుకుంటారు. పువ్వులు, పళ్లు, బియ్యం, కొబ్బరికాయలువంటి పూజాద్రవ్యాలుగాని, నైవేద్యాలుగాని, హారతి, సంగీతంవంటివిగాని అక్కడ వుండవు ఆశీర్వచన పూర్వకంగా యిచ్చే పవిత్ర జలంగాని, విభూతిగాని అక్కడలేదు వారు చెప్పే ఒక శుద్ధ సన్మార్గ సత్య చిరు విన్నపంలో వారు యిలా ప్రార్థిస్తారు

అందరికీ ప్రభువా, అఖండ దివ్యతేజస్వీ! అనుగ్రహింపుము
ఇకమీద మా మనసులు కలుషితములు కాకుండ
ఆచారాదికములు ఇతర వాంచల్యములగు మతములు

తెగలు, సాంస్కృతులు, ఇతర భ్రమలు

కులములు, పట్టింపులు

ఆత్మయొక్క అనన్యత్వము అన్ని జీవులయందు ఎఱుకపడనిమ్ము

ఆత్మశోధకుని ముఖ్య అన్వేషణము అదియెగాన

ఎట్టి సమయమునందును, ఎంతమాత్రమైనను

ఏ విధమునైనను, ఎచటనైనను మమ్ము విడచిపెట్టకు

ఎల్లప్పుడు ప్రకాశించుచు మమ్ముల నడిపించుగాక.

ఓ దివ్యతేజస్వీ ప్రభూ, నీ కృపకై నీకు మా కృతజ్ఞతలు,

మరల మా కృతజ్ఞతాంజలి యందుకొనుము

సత్యజ్ఞాన సభ భవనాన్ని 24 ఏప్రిల్ 1950లో కృపానంద వారియర్ నేతృత్వంలో భక్తులు తిరిగి బాగుచేసి పునరుద్ధరించి ప్రారంభించారు

# అధ్యాయం 17

# మెట్టుకుప్పంలో – అంతిమదశ

25 జనవరి 1872లో సత్యమందిర ప్రారంభోత్సవం జరిగేదాకా మెట్టుకుప్పం వచ్చిన తరువాత రెండు సంవత్సరాలు; రామలింగ ఆ మందిర నిర్మాణంలో నిమగ్నులై ఉన్నారు. అటు తరువాత క్రమంగా తమ కార్యకలాపాలనుంచి దూరమవుతూ, అంతర్ముఖులవడం ప్రారంభించారు. బ్రహ్మదండికా యోగం రెండు అగ్నికుండాల మధ్య కూర్చొని యోగాభ్యాసం చెయ్యడం మొదలుపెట్టారు ఒక గడియలో తనకు యోగస్థితిని సిద్ధింపజేసినందుకు ఆ భగవంతునికి ఒక కీర్తనలో తన ధన్యవాదాలు తెలుపుకున్నారు గడియకు 24 నిముషములు సమానం దీన్నే తమిళంలో నజికై అంటారు

గడియలోన ఒక సాయంకాలము
యోగసిద్ధికి దారిజూపితివి నీవు;
మరునాటి ఉదయమే ఇచ్చితివి నీవు
దాని నిండు ఫలము.

తమిళనాడులోని సిద్ధులను గురించి సామాన్యంగా, సిద్ధిపొందుట, లేదా దైవత్వానికి చెందిన అన్ని అర్థములతో గూడియున్న స్థితినందుట జీవితలక్ష్యం కాని ముక్తి, లేదా విముక్తి. జనన మరణాలను త్రిప్పటలనుండి బంధవిముక్తికాదు అని వారి నమ్మిక. సాంప్రదాయిక, శాస్త్రసంబంధపరమైన ముక్తిని గురించిన వ్యక్తీకరణ గురించి వారి సమ్మతి తెలుపుతూనే, ఇది మాత్రమే అంతిమలక్ష్యం కాదనీ ఇది దైవత్వం, దైవస్వరూపంలోవున్న సిద్ధి – అదే పరమావధి, ఆ పరమావధిని చేరేందుకు క్రింది మెట్టు మాత్రమేననీ అంటారు వారి దృష్టిలో ముక్తి, సిద్ధి ఇవి రెండూ ఒకే నాణెమునకు రెండు ముఖాలు ముక్తి జీవాత్మ పరిపక్వత చెందిన అవస్థకు ప్రతీక, సిద్ధి జీవాత్మయే. పరమోత్కృష్ట కటాక్ష జ్యోతికై వారు వ్రాసిన ప్రార్థన గీతంలో, యిలా వ్యక్తం చేస్తున్నారు

దివ్యానుగ్రహమును గురించి సర్వోత్కృష్టమైన జ్ఞాన జ్యోతి తెలియజేసితివి

దైవత్వమునకు దారిజూపె విమోచనముగా
ముక్తి దానికీవలి స్థితిగా కడపట
సిద్ధులగుటకు, గమ్యస్థానమున అడుగిటకు, అనుభవైక రాజ్యము

అక్టోబర్ 1870లో ఒకరోజు వారు అంతర్థానమై కొద్దిరోజులపాటు ఎవ్వరికీ కనబడలేదనీ వ్రాతమూలకంగా ఆధారం వుంది. వారి శిష్యులను, అనుయాయులనూ శాంతపరచుటకుగాను వారు ముందుగానే, క్రమంగా వారు యిచ్చే ఆదేశాలు ఒకదానిలో ముందుగానే వారిని హెచ్చరించారు.

భగవంతుని మహిమ – పలువురి మంచి కొరకు ఒకరు కారకులు కావచ్చు
నని నమ్మండి నా ద్వారా మీరు లబ్ధిని పొందగలరని విశ్వసించండి. ఆ
భగవంతుని కృపద్వారా, కొద్దిరోజులలో నా దేహం మీకు కనబడ
కుండ దాగియుండును. కొలది కాలము మాత్రమే భయమొందకుడు
భోజనశాలను ధైర్యముగా కొనసాగించండి అంతా భగవంతుని మహిమ.

ఈ పత్రం వడలూర్ పంపించి, తరువాత మెట్టుపాలెంలో వారి గదిలో ఒంటరిగా ఉండి లోపల బంధించుకొని ఉండిపోయారు చాలారోజులదాకా తిరిగి వారు వెలికి వచ్చేదాకా, గది తాళం అలాగేవుంది ఎవ్వరూ ఏమీ చూడలేదు, వినలేదు వారిని గురించి ఏమీ తెలియలేదు వారి పద్యాలలోనూ, ప్రసంగాలలోనూ, మానవ లస్తిత్వ శరీరానికీ, పరిశుద్ధ శరీరానికీ వున్న తేడాలు – శుద్ధం, ప్రణవం. జ్ఞానం అని సూచించారు ఈ మూడింటినీ ఆత్మశరీరం, మానస శరీరం, ఆధ్యాత్మిక శరీరంగా చెప్పవచ్చును వారి వ్యాఖ్యానాల అనుసారం యీ మూడు శుద్ధ కాయాలలో మొదటిది రుగ్మత, ముసలితనం, దేహసంబంధమైన కార్యకలాపాలకు పరిమితంకాదు దీని నీడ పడదు, రెండవది గోచరం, కాని పట్టుబడనిది, మూడవది దృశ్యాదృశ్యం కాలాతీతం

ఛాయాచిత్రాలు తీయించుకోవడం అంటే వారికి చాలా అయిష్టం అని వారి శిష్యులు చెపుతారు. ఎనిమిదిసార్లు వారికి తెలియకుండా వారి ఛాయాచిత్రం తీయడానికి ప్రయత్నిస్తే బొమ్మపడలేదు. కాని వారి బట్టలు మసకమసకగా మాత్రం పడ్డాయట చివరికి పన్నుమత్తిలో వున్న ఒక శిల్పి మట్టితో వారి మూర్తిని తయారుచేసి వారికి చూపించారట "ఆఖరికి యీ 'బంగారు' శరీరం మట్టి శరీరం అయిందన్నమాట" అని వారు వ్యాఖ్యానించినట్లు చెపుతారు. 'బంగారు' శరీరం అన్నమాటకు తమిళలో ఆధ్యాత్మిక, సూక్ష్మశరీరం అని వ్యవహరిస్తారు ఇప్పుడు మనకు లభ్యమైన రామలింగ ఛాయాచిత్రాలన్నీ ఆ విగ్రహానివే అంటారు

మరణరహిత దేహాన్ని అది సాధించడంలో వారి అంతిమ విజయం, దానితో పాటు మానవాతీత శక్తులు సాధించడానికి వారి ప్రార్థనలు, ప్రయత్నాలను గురించి రామలింగ ఎన్నో పద్యాలలోనూ, కీర్తనలలోనూ పేర్కొన్నారు.

నా తండ్రిని కనుగొంటిని, పొందితిని నేను
మృత్యువు లేని స్థితి* నిశ్చయముగా
దైవశక్తులు నా వశమైనవి.
నేనైతిని,
ఆత్మ విషయమై పారంగతుడను

తిరిగి యిలా అన్నారు :

మృత్యువు ఎప్పుడూ లేదు నాకు
ఆ ప్రభువే నాలో వెల్లివిరిసెను
నేనాతనిలో తారతమ్యత గతించెను
మేమిరువురగమొకటి! అచ్చెరువందితిని నేను
ఇదియెట్లు సంభవించినదో
ప్రాపంచిక మానవులారా, పంచుకొనుడు నాతో
ఈ బ్రహ్మానందమును, దుఃఖమును విడువండీ!

ఎన్నో పద్యాలలో భగవంతుడు తనను తనవానిగా,తన సుతునిగా వేసుకున్నాడని వారన్నారు

మతము సిద్ధాంతములలో చిక్కుకొన్న మానవులారా జాగ్రత్త
మతమను పుష్క నాటకముల వినోదించు ఏమి ఎరుగని
పసిపాపలవోలె, చిక్కుపరచుతుదకు ఫలము లేకయె
మరణింతురు. ఇకమీదట జీవులెవరు
వృథాకానీయకు, వారిలోని సత్యజ్యోతి వెలిగింపుము
శుద్ధ జ్ఞాన మార్గమువైపు, వారి నడిపింపుము,
ఆ రీతిని బ్రహ్మానందమునకు, నీకు నా కుమారా,
వారి నాదరించుమని అప్పగింతు[1] అని నీవంటివి, నా ప్రభూ,
ప్రకాశజ్యోతీ, ఆ జ్యోతి యొక్క ప్రభాభావిత జ్ఞానమా,

---

* మృత్యువు. మృత్యువులేని స్థితి : దేహసంబంధమైన మృత్యువుగాని సామాన్యంగా భావించే అమరత్వంకాదు

చీకటిని పారద్రోలువాడా, సర్వవ్యాపకుడవు.

నిరాకారత్వమునుండి పరిపూర్ణ సమన్వయ శబ్దమువరకు!

తిరిగి యిలా అన్నారు :

నీ యనుగ్రహమత్యద్భుతము, నా తల్లీ –

నాదిగా జేసిన బ్రహ్మానందము, నాకిడిన యీ నామము,

నీ పుత్రుడనుచు నన్ను నిలిపి

శుద్ధ జ్ఞాన మార్గమునందు, సత్యమునందు!

ఈ నిశ్చల పరవశత్వమును తైత్తిరీయోపనిషత్తులోని యీ క్రింది పేర్కొనిన దానితో పోల్చి చూడదగినది

బ్రహ్మత్వము సిద్ధించిన వెనుక ఒక సిద్ధుడిట్లనియెను
నేనే జీవికను నా మహత్యము కొండ శిఖరము
వంటిది బ్రహ్మత్వపు పవిత్రతలోనే నియమింప
బడితిని. ఆత్మనుండి విముక్తినే పొందితిని
నేనే బ్రహ్మమును, స్వయంప్రకాశుడను
జాజ్వల్యమాన సంపదను జ్ఞానము వరముగా నొందితిని
నేను శాశ్వతుడను, నశ్వరుడను!

(ఆంగ్ల మూల అను : స్వామి ప్రభవానంద, ఫ్రెడరిక్ మాంచెస్టర్)

ఈ కాలంలో రామలింగ వ్రాసిన కీర్తనలు, పద్యాలు వారి నిర్యాణం తరువాత ఆరు సంవత్సరాలకు 1880లో కరుణాపూరిత పవిత్ర గ్రంధానికి ఆరవ భాగంగా ముద్రింపబడింది. ఆ పవిత్ర గ్రంధాన్ని జ్ఞాన దేహంగా భావిస్తే యీ ఆరవ భాగం ఆ దేహానికి ముఖం, మహోన్నత జ్యోతికి ప్రార్ధనాగీతం నేత్రాలు, మంత్రాలు, కటాక్షమహోన్నత తేజస్సు కంటిపాపలు. ఈ ప్రార్థనా గీతం అహవల్ ఛందస్సులో 1596 పంక్తులలో వ్రాయబడింది. అంత పెద్ద రచన ఆ ఛందస్సులో తమిళ పద్య వాఙ్మయంలో ఎక్కడాలేదు. అది రచించిన తేదీకూడామనకు లభ్యమయింది – 18 ఏప్రిల్ 1872.

ఇదే సమయంలో రామలింగ వచనంలో దివ్యతేజోమూర్తికి వినతులు అని కూడా రచనలు సాగించారు. అప్పుడప్పుడు సన్మార్గ సూత్రాలను బోధిస్తూ సభకు సూచనాపత్రాలు కూడా జారీచేస్తూ వుండేవారు. 30 మార్చి 1871 మందిరానికి ఆదేశాలు అన్నదాంట్లో యీ విధంగా వుంది.

క్రియాకర్మల ప్రాబల్యం చేతగాని, కాలవశం చేతగాని, ఎవరైనా దేహం అంతమైతే ఆ దేహాన్ని దహనం చెయ్యకూడదు. దానిని పాతిపెట్టాలి చనిపోయినవారుపునరుజ్జీవులగుదురన్న నమ్మకంమీద దృఢవిశ్వాసం కలిగివుండాలి దుఃఖానికి
సంతాపానికి తావివ్వకూడదు. స్త్రీ భర్తను కోల్పోతే, ఆమె మంగళసూత్రాన్ని ఆమె మెడలోనే ఉండనివ్వండి. మగవాని భార్య మృతి చెందితే తిరిగి వివాహమాడే
యోచన మానండి. పుత్రుడు గతిస్తే చింతించవద్దు. చనిపోయిన వారికి కర్మాది విధులు చేయనవసరంలేదు. నష్టం పొందిన వారందరు ఒకరోజు చేరి తోచినంతమందికి ఉచిత భోజనం పెట్టండి

వారి ఆధ్యాత్మిక చింతనకు సంబంధించి అద్భుతమైన వ్యాఖ్యానాలు, వారి బోధనలు, వారి మాటలలోనే అనేక సందర్భాలలో వారు మెట్టుకుప్పంలో ఇచ్చిన ప్రసంగాలనుంచి శిష్యులు సేకరించి సమకూర్చినవి కృపా ప్రసంగ వచనాలు అన్న పేరుతో ఒక చిన్న పుస్తకంలో యీ విధంగా వుంది.

ప్రపంచంలో అనేక మతాలు వున్నాయి. ప్రతి మతానికీ భగవంతుడు, ఒక మార్గం,
అనుసరణీయ విధానాలు, సాధన మార్గాలు వున్నాయి. ప్రధానమైన సత్యానికి యివన్నీ భిన్న మార్గాలు తప్ప వేరు ఏమీకాదని చెప్పుట మనం విని ఉన్నాం అదియే.

శుద్ధ సనత్యం అనే గమ్యం చేరడానికి మార్గం అందువలన వారి పవిత్ర హక్కులపై నమ్మిక ఉంచి మీ అంగీకారం తెలపాలి. ఆ మాటలలోని సత్యాన్ని మీ అంతట మీరే గ్రహించి, వారి మూఢనమ్మకాలు కర్మకాండలూ విడిచిపెట్టాలి
వారి సుప్రసిద్ధ మత ప్రసంగం వారి నిర్యాణానికి మూడునెలలు ముందు 22 అక్టోబర్ 1873లో. అదియే వారి అంతిమ బోధనా ప్రసంగం. మెట్టుకుప్పంలో వారి గృహంపై సన్మార్గ సోదర సంఘం (సిద్ధి విలకం) వారి పతాకావిష్కరణ సందర్భంగా జరిగింది మానవునిలో అంతర్భూతమైన ఆధ్యాత్మిక శక్తి మార్గానికి చిహ్నంగా రూపొందించబడింది. నాభినుండి కనుబొమల మధ్యవరకు ఆ నాళం వుంటుందని యోగసిద్ధుల అనుభవంవల్ల తెలుస్తోంది. చాలా విధాలుగా యీ ప్రసంగం కనువిప్పు కలిగించింది. రామకృష్ణ అంతిమ ఔన్నత్యాన్ని చూపింది

వారు యీ విధంగా ప్రబోధించారు

మీరు యిప్పుడు చేస్తున్నట్లే మీ కాలాన్ని వ్యర్థం చెయ్యకండి –
ఆధ్యాత్మిక చింతనతో కాలాన్ని గడపండి.
ఆ చింత ఇది : మన మానవ స్థితి ఏమిటి, మనకు అతీతంగా వున్న
శక్తులు, మనలను నడుపుతూన్నవి ఏవి?
ఈ వేదాలు, ఆగమాలు, పురాణాలు యివన్నీ అఖిల జగత్తులో సూక్ష్మ
ప్రపంచానికున్న స్థానాన్ని మాత్రమే మన ముందుంచాయి. అందుచేత
ఇటువంటి సాంప్రదాయికంగా మనం అలవాటుపడి వింటూన్న వీటిని
కూడ బెట్టుకొనవద్దు
మానవాతీత శక్తులు సంపాదించడం, అద్భుతాలు చెయ్యడం సంభవమే.
కాని వీటివైపు దృష్టి వుంచవద్దు. ఇటువంటి చిన్నచిన్న లాభాలు నిష్ఫలం
అవి నిజమైన, బృహత్తరమైన లాభాలనుండి నిన్ను వంచితుణ్ణి చేస్తాయి.
అందుచేత మనసు చెడకుండా నిశ్చలంగా ఆ భగవంతునిమీదే పూర్తిగా
కేంద్రీకరించాలి
అట్లే నీ నమ్మకాన్ని మతాలమీదే కేంద్రీకరించవద్దు అవి సత్యజ్ఞానం
నుండి పుట్టిన ఆధ్యాత్మికానుభవాలను ఇవ్వజాలవు... నాకు శైవమ
తంమీద ఉండిన అభిమానం అతిశయోక్తిగా చెప్ప వీలుపడదు. నా
పద్యాలు,
ప్రార్థనలు యివన్నీ దీనికి తార్కాణాలుగా నిలచి వున్నాయి. నాలో గాఢ
మైన జ్ఞానం లేకపోవుటయే నాయందు యీ గట్టి నమ్మకం ఉండడానికి
కారణం
ఇప్పుడు భగవంతుడు నన్ను శిఖరాగ్రానికి ఎత్తినాడు అది అంతా
విడిచివేశాను గనుకనే కాబోలు. మీరు కూడా అన్నిటినీ పరిత్యజించి
నావలెనే దివ్యజ్ఞానాన్ని పొందండి... కాని నన్ను నిజంగా పైకెత్తినదేది?
.... అది అనుకంప దానిని కటాక్షమని ఎవరైనా అనవచ్చు
సర్వసమానత్వ భావనతో యీ అనుకంపను సాధించవచ్చు ఈ భావనయే
ఆ భావనయే కరుణవైపు మానవుని కొనిపోతుంది. ఇప్పుడు జ్ఞానం
భ్రమించుచున్న విశ్వానికి అతీతంగా సాగిపోయింది.
ఒక పదార్థంయొక్క రుచి దానిని అనుభవిస్తేనే కాని మీకు తెలియదు
రుచి తెలియని పదార్థం వైపు మీరు ఆకర్షితులుకారు అదేవిధంగా భగ
వత్ స్వరూపం యొక్క బ్రహ్మానందాన్ని అనుభవిస్తేనే కాని భగవంతుని
వైపు ఆకర్షింపబడరు. అందుచేత భగవంతుడు అంటే ఏమిటో తెలుసుకొనే
ఉన్నత ఆసక్తి ఆదర్శం మొదట పెంపొందించుకోవాలి .
ఈ శోధనలో పట్టువిడువకుండా సాగిస్తే భగవంతుడు నీ దరిచేరుతాడు

నీకు తగిన రీతిని తెలియజేస్తాడు. తరువాత నీవు పెరిగాక అతడు నీకింకా ఎరుక పరుచుతాడు. కొంతసేపు నా తదుపరి నీకు సలహా నిచ్చువారెవ్వరూ ఉండరు. ఆ కారణంగా నిర్లిప్త మార్గాన సంచరించడాన్ని కొనసాగింపకుము. ఇవి నా చివరి మాటలు.

వారు వ్రాసిన చాలా పద్యాలలో చెప్పినట్లుగానే యిక్కడ కూడా గుర్తించదగిన ఒక విషయం పునర్జన్మ, దివ్యత్వం సాధించడం; యివి రెండే వారి జీవిత లక్ష్యం అని. వారి అనుచరులపట్లగల అసంతృప్తిని కూడా గ్రహించవచ్చు. ఇది కొంచెం ప్రస్ఫుటంగా ఉచిత భోజనశాలకు పంపిన సూచన పత్రాలలో గమనించవచ్చు వారి నడవడిక గురించి ఆక్షేపణలు సూటిగా, గట్టిగా ఉన్నప్పటికీ సున్నితంగా వుండేవి. ఈ విషయాలన్నిటి సందర్భంగానే దివ్యజ్ఞాన సమాజం గురించి తమ శిష్యులందరితో దయతో చూసేవారు కొందరు వస్తున్నారంటూ వారిని గురించి ప్రసంగించెదరు.

# అధ్యాయం 18

# రామలింగ నిర్యాణం

సభ లేదా మందిరం నడిపే విధానంమీద వారిలో అసంతృప్తి పెరిగి చివరకు దానిని 1873లో మూసివేద్దామని నిర్ణయించుకొనే స్థాయికి వచ్చింది ఆ సభ ప్రారంభించిన ఆరునెలల్లో రామలింగ 1872 జూలై 18న వ్రాతమూలకంగా సూచనలు, ఆ మందిర నిర్వహణ గురించి వివరిస్తూ పంపించారు. భక్తులు మందిర ప్రాంగణద్వారం ముందర నించే ప్రార్థనలు సేవలు చెయ్యాలి అని, పన్నెండేళ్ళలోపువారుగాని, డెభై రెండేళ్ళు పై బడినవారుగాని దీపం వెలిగించాలని వారు ఆదేశించారు. అనుచరులు తనకు తగిన వారుగా వారికి తోచలేదు. సభ మూసివేసి తాళాలు తమవద్ద సిద్ధివిలక్కంలో ఉంచుకున్నారు. ఆ మందిరం వారి మరణానంతరం నాలుగు సంవత్సరాలవరకూ మూతబడే వున్నది. అప్పుడు 1878లో సోదర సంఘంవారు దానిని తిరిగి తెరచి మరలా పూజాదికాలు ప్రారంభించారు.

సభ మూసివేసిన తరువాత 22 అక్టోబరు 1873న సుప్రసిద్ధ భక్తిసందేశం వచ్చింది సిద్ధివిలక్కంలో. ఇది వారి బాహ్య కార్యకలాపాలకు చివరి గురుతు. దీని చిహ్నమా అనునట్లు ఆ మరుసటి నెలలోనే వెలిగించిన జ్యోతిని వారి గదినుంచి తీసి బయట ఉంచారు. లిఖితపూర్వకంగా తెలిసిన దానినిబట్టి వారి శిష్యులకు, అనుయాయులకు, 'ఏ ఆటంకమూ లేకుండా మీరిచట ప్రార్థించవచ్చు. నా గది తలుపులు బంధించివేస్తాను కొంతదనుక ప్రభువు ఈ జ్యోతిలో ప్రభవించుతుంది దీనిని మీరు వినియోగించుకొనండి. సమయం వృధాపరచకండి. "యోచించండి, తిరిగి యోచించండి ఆతని గురించి" సరియైన ప్రార్థన కీర్తన కాగలదు' అని రామలింగచెప్పారు.

'కొంతదనుక ప్రభువు ఈ జ్యోతిలో ప్రభవించును' అన్న ప్రకటన వలన రామలింగ ఆ ప్రభువు ఆగమనాన్ని ఎదురుచూచుచున్నారనీ, తమకు అంతిమ సమయమాసన్నమైనదనీ ఊహించినట్లు తోచుచున్నది ఆ సమయంలోనే

వ్రాసిన ఒక కీర్తనలో ఇది విశదంగా కనబడుతుంది.

ప్రాపంచిక మానవులము, ఆతని ప్రార్థించువారము
అమృతమనే అనుగ్రహము, మనము మ్రొక్కులిడు ప్రభువు, రాజు,
మంచికి కాణాచి, నర్తకుడు యదార్థతను సరితూచుచు,
ఎల్లప్పుడు, ఎల్లప్పుడు, అతని గూర్చి పాడుకొందుము
భక్తి కొలుతుము, తలచుచు మరియు తలచుచు అతనినే,
నిత్యమాతని సన్నిధి వున్నటులె భావించుచున్న తొట్రుపడుచు ప్రేమతో
తడియారు కన్నీటితో, మేముందుము నీతో వినుము!" –

ఘడియ పండెను ఆతని రాకకై,
మరణము కాని దివ్యజీవము మనకు;
సమయమాసన్నమాయె మనము దేవుని వేదికపై నడుగిడుటకు
సత్యమునే పలుకుదము మనము, వంచన యిచటలేదు

శబ్దార్థ రీత్యా కాకపోయినా, అలంకారశాస్త్ర రీత్యా అయినా రామలింగకు సంబంధించినంతవరకూ అచట సత్యమున్నది. కీర్తన వెనుక కీర్తన చొప్పున అనేక కీర్తనలలో వారు దీనిని రూఢిగా చెప్పారు. వారి గది వెలుపలనుంచిన ఆ జ్యోతి 1873 నించి యిప్పటివరకూ అఖండముగానే వెలుగుతూ వుంది. ఈ జ్యోతిని చూడడానికీ, వడలూర్‌లోవున్న జ్యోతిని చూడడానికీ వేలాది జనం వస్తున్నారు. జ్యోతిని గది వెలుపలనుంచిన వెనుక రామలింగ గదిలో తలుపులు మూసుకొని తమని తాము బంధించుకున్నారు. అప్పటినుంచీ రోజుల తరబడి మూసిన గదిలోనే వుంటూ అప్పుడప్పుడు కొన్ని రోజులు మాత్రం బయటికి వస్తూ, ప్రజలను ఉద్దేశించి ప్రసంగిస్తూ వుండేవారు ఈ విధంగా మూడు మాసాలు గడిచాయి తమ మహాభి నిష్క్రమణ సమయాన్ని గురించి ప్రజలకు వారు సూచననిచ్చారు. వ్రాత మూలకంగా వున్న సాక్ష్యం ప్రకారం 'నేను అంగడిని తెరిచాను. కాని కొనే వ్యక్తిలేడు అది మూసివేయబడుతుంది ఇప్పుడు నేనీ దేహంలో ఉన్నాను త్వరలో అన్ని దేహాలు నావే అవుతాయి." అని వారు చెప్పారు

30 జనవరి 1874, చాంద్రమాన అష్టమి, శుక్రవారం, రాత్రి చీకటులు ఆవరించగానే శిష్యులను పిలచి వారు చెప్పిన మాటలు (వారి ముఖతః వచ్చినట్లు

నమోదు చెయ్యబడినవి) :

పది పదిహేను రోజుల వరకు నేను గదిలో ఒంటరిగా తలుపులు మూసుకొని

ఉంటాను. గదిలోకి తొంగిచూడవద్దు. భ్రమ చెందవద్దు. మీరు అట్లా చేస్తే ఏమీ అగుపడదు. అట్లగునట్లు ఆ ప్రభువు ఆ విధంగా చేయును. వారు నన్నెరుకపరచరు.

అర్ధరాత్రి అచట చేరిన ప్రజలందరూ వీడ్కోలు పూర్వకమైన ఆశీర్వచన వాక్యములు పలుకుతూ, సత్యజ్ఞాన మార్గాన్ని అనుసరించవలసిందనీ, పరమోత్కృష్ట దివ్యస్వరూపుని కటాక్షాన్ని అర్థించుడనీ ఉద్బోధించిన పిమ్మట గదిలోనికి వెళ్ళి తలుపులు బంధించుకున్నారు. తరువాత వారిని ఎవరూ చూడలేదు. వారి శిష్యుల నమ్మకం ప్రకారం వారు 'దివ్యజ్యోతిలో ఐక్యం పొందా'రనీ ఆ 'పరమాత్మలో తాదాత్మ్యం చెందా'రనీ అంటారు. వారు ఊహించి ముందు ఇట్లు జరుగును అని చెప్పిన కీర్తనలు, పద్యాలు, ఆధారంగా రెండున్నర గడియలలో వారు దైవత్వం పొందారని శిష్యులు నమ్ముతారు.

ఈనాడతడరుదెంచు, నేకూరుచుండినచోట ఆతడు కూరుచ్చుండునేడు,
నా దేవా, నా ప్రభువా నా జీవితమునకు భాగస్వామి
రెండు గడియల సగములోన
నాతో కలియు, కూరుచుండునాతడు
నా చేతనములో, శాశ్వతముగ నచట నుండుటకు,
ఇది నే ప్రకటింతు, ఇది నే ధృవపరతు, ఇది నా కెరుక
అగాధమైన తపస్సునుండి, ఇది సత్యమని తెలుసుకొనుడు
దీని నిజము బహిర్గతమగును
రెండు గడియల సగములో, క్షణమైనను దాటకుండగ.

ఆఖరి సందేశ ప్రకటన పదిసార్లు పది పద్యములలో తిరిగి చెప్పబడింది. రామలింగ నిర్యాణం పెద్ద సంచలనాన్ని కలిగించింది. వివిధ రకాలైన ప్రచారాలకు దారితీసింది. చివరకు ప్రభుత్వం ఈ విషయం పరిశీలించడానికి నిశ్చయించుకుంది. వారు గతించిన మూడు మాసాల తరువాత మే 1874లో శ్రీ జె.హెచ్.గార్స్టిన్ ఐ.సి.ఎస్ , దక్షిణార్కాట్ జిల్లా కలెక్టర్, శ్రీ జార్జి బాన్‌బరీ ఐ.సి.ఎస్. బోర్డ్

రెవెన్యూ సభ్యులు కలసి సిద్ధివిలక్కం వచ్చారు. వారి సమక్షంలో గది తలుపులు తెరవబడ్డాయి. గది నలుమూలలా వారు నడిచారు. అభియోగసంబంధమైన సాక్ష్యం యేమీ దొరకకపోవడంచేత అక్కడ జరుగుతూన్న అన్నదాన సత్కార్యానికి ఇరవై రూపాయలు విరాళంగా యిచ్చి తిరిగి వెళ్ళిపోయారు.

మద్రాసు జిల్లా గెజిటీర్స్‌లో – దక్షిణార్కాటు జిల్లా (1906 : పుటలు 316–317) రామలింగ జీవిత విశేషాలు క్లుప్తంగా ఇవ్వబడినాయి. దానిలో కొన్ని అంశాలు ఈ క్రింద పొందుపరచడమైనది :

పార్వతీపురం :1, 189 మంది జనాభావున్న ఒక గ్రామం విరుద్ధాచలం రహదారిపై కడ్డలూరుకు ఇరవై మూడు మైళ్ల నైఋతి దిశగా వుంది. ఈ గ్రామం రామలింగ పరదేశీ అనే వ్యక్తికి సంబంధం వుంది ఆయన ప్రజలు దైవసమానులుగా కొలిచే ఆధునిక మహాత్మునిలాగ కనబడే ఒక ఉదాహరణ :

మరణించిన తరువాత తిరిగి వారు పునరుజ్జీవులవుతారని వారి శిష్యులకు ఉద్బోధించి, తత్ఫలితంగా దహనానికి మారుగా పాతిపెట్టుటయే శ్రేష్ఠమని ప్రేరేపించారు ఈ నమ్మికలోనే బ్రాహ్మణులు కూడా దహనానికి మారుగా పాతిపెట్టుటయే చేస్తున్నారట ఇతర గ్రామాల్లో చనిపోయిన వారి మృతదేహాలను వడలూర్ తెచ్చి అక్కడ పాతిపెట్టేవారట 1874లో మెట్టుకుప్పంలో (కరుంగుజి గ్రామం) ఒక గదిలో వారు లోపల బంధించుకొని (ఇప్పటికీ ఆ గది వుంది) ఆ స్థలాన్ని తమ సమాధి, లేదా ఆధ్యాత్మిక ధ్యానమునకై వినియోగించుకొని, శిష్యులెవరినీ కొంతకాలం వరకూ తలుపులు తీయవద్దని ఆదేశించారు. అప్పటినుండి వారినెవరూ చూడలేదు వేసిన తాళం ఇంకా అలాగేవుంది. వారిమీద ఇంకా నమ్మకం ఉన్నవారు వారు భగవంతునిలో ఐక్యం అయ్యారని కాలపరిపూర్ణతతో వారు తిరిగి తనను నమ్మిన వారివద్దకు వస్తారని భావిస్తారు

రామలింగ శిష్యులలో ఒకరైన దండపాణిస్వామి వారు ఒక పద్యం వ్రాసి అందులో తాను తిరిగి యీ ప్రపంచానికి వస్తానని గురువుగారు చెప్పిన మాటలను యిచ్చిన సందేశాన్ని తిరిగి పదకొండు పాదాలలో వ్రాశారు. చాలామంది యీ విశ్వాసాన్ని పంచుకుంటారుకూడా

పదహారవ శతాబ్దపు చివరి దశలో జీవించిన తాయు మానవర్ అన్న మహాభక్తుడు, కవియొక్క అవతారమే రామకృష్ణ అని మరొక ఆశ్చర్యకరమైన

ప్రకటన చేశారు దండపాణివారు. మహాత్ముల జీవితాలలో జరిగే వింతల గురించి సర్వసాధారణంగా వింటున్నట్లే రామలింగను తమ స్వప్నంలో చూశామనీ, స్వయంగా చూశామనీ, అనేకమంది శిష్యులు వారి అనుయాయులు చెపుతూ వుంటారు.

తమ జీవితం ఒక ఆధ్యాత్మిక పరిశోధనకు సాధనమని వారు తమ జీవితాన్ని సంక్షిప్తంగా ఒక కీర్తనలో చెప్పారు. వారి అవసాన కాలంలో మెట్టుకుప్పంలో వ్రాశారు ఈ కీర్తనను.

అగాధమును దాటితిని, తీరమును జేరితిని,
నే పొందితిని,
ఆలయం తలుపులుదాటి అచట తెరచుకొన్న
భవిష్యద్దర్శనము ప్రకాశించెను
నే పొందితి నీ కటాక్షము అన్ని బాధలను అంతముచేయు
నే జయించితి నా తేజము విజ్ఞానమును వెలుగొందించునది.
నే పొందితి నా మరణములేని దేహము, శక్తుల విజయించు
కీడులను, దేహపు కట్టుబాట్లను, ఆత్మయొక్క బ్రహ్మానందము
కటాక్షమునకు గురుతులు ఆ మహానాట్యదేవతవి.

ఈ పద్యం టెన్నిసన్ కవి వ్రాసిన 'క్రాసింగ్ ది బ-ర్' అన్న పద్యాన్ని అన్నివిధాలా గుర్తుచేస్తుంది.

సూర్యాస్తమయము, సాంధ్యతార
నాకో స్పష్టమైన పిలుపు!
మూల్గు ఉండకుండుగా ప్రతికూలతకు
యానమ్మునకు బోవ సంద్రమున
నీవు దేశకాలాల పరిధిలో నుండి వెలువడి
వెల్లువ నన్ను సుదూరము భరింపగలుగవచ్చు
సముఖాన చూడనాశింతును, నావ నడుపు చోదకుని
ప్రతికూలత నధిగమించిన వెనుక.

ఈ రెండిటి సామ్యం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. రెండిటిలోనూ వున్న భేదం కూడా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. నావ నడిపించే వానిని కలుసుకోవాలని కవి ఆశ. తుల్యంగా నావ నడిపే వానినే ముఖాముఖిగా కలుసుకోవాలని రామలింగస్వామి వారి స్వప్నాకాంక్ష

# అధ్యాయం 19

# రామలింగ, దివ్యజ్ఞాన సమాజం

మెట్టుపాలెంలో ఉన్న చివరి సంవత్సరాలలో ఆచారాదిక వ్యవహారాలకు దూరంగా ఉంటూ కనబడేవారు. అన్ని జీవులలోనూ ఉన్న ఆత్మను (మానవ జాతిలోనే కాదు) గుర్తించి దాని ఆధారంగా విశ్వసౌభ్రాతృత్వమును దర్శించిన ప్రవక్తగా మారిపోయారు. భగవంతుడు అందరిలోనూ ఉన్న చైతన్య తేజస్స్వరూపుడని, అతనిది పరమదయాగుణమనీ, అతనిని సాధించుటకు ప్రతిమానవుడు తన స్థాయిలోనే ఆ దయాగుణము నవలంబించాలనీ రామలింగ భావించారు. మతపరమైన పూజాదికాలు, నమ్మకాలు, ఆచారాలను, త్యజించారు. సత్యజ్ఞానమొక్కటే వారి ఉపగమార్గమన్నారు. అదియే మత ఆడంబరాలకు దూరంగా ఉండే పరమోత్కృష్టమైన జ్ఞానం, జీవితమంతటిలోనూ శ్రేష్ఠమైన ఆత్మను గుర్తించడం అదే వివిధ స్థాయిలలో అచేతన జగత్తులో కూడా గుర్తుపట్టడం. సర్వమానవ సౌభ్రాతృత్వమే అన్ని మతముల సారాంశమన్న యీ శుభ సందేశానికే, దివ్యజ్ఞాన సమాజం వారి సందేశానికీ భేదం లేదు. ఈ చేతన జగత్తు నాలింగనము చేసికొని ఆత్మజ్ఞాన, దైవజ్ఞాన శక్తులను కరుణ ద్వారా పొందవచ్చునన్న సత్యాన్ని నొక్కి వక్కాణించారు రామలింగ. దానిని వారు ఆచరించి, బోధించిన దాకా దివ్యజ్ఞానం విస్తరించలేదు. ఈ సూత్రాల ఆధారంగానే 1865లో వడలూర్‌లో సమరస వేద సన్మార్గ సంఘం స్థాపించారు. అన్ని మతపరమైన అర్థాలను, సంబంధాలను విసర్జించే ఉద్దేశ్యంతో దాని పేరును సమరస శుద్ధ సన్మార్గ సత్యసంఘం అలాగే వారు స్థాపించిన అన్నశాలకు, పాఠశాలకు పేర్లు మార్చేశారు. అయితే ఒక్క విషయం మాత్రం నిజం. వారి దైవం దివ్యతేజోమయుడైన ఆ పరమశివునికి ప్రతిరూపం మాత్రమే. శూన్యం నుండి ఊహించబడి, వారి కీర్తనలు, పద్యాలలో వారు కీర్తించినట్లు, ఆ దివ్యతేజాన్ని వారు "శివా, నటరాజస్వామీ, విశ్వనర్తనము చేయు నటరాజా, విశ్వాంతరాళములకు అధిపతీ" అని వివిధ నామరూపాలతో స్తుతించారు. హిందూ సాంప్రదాయిక ధర్మంలో కూడా పరమశివుని శుద్ధతేజోమయ కటాక్ష స్వరూపుడు అని భావిస్తారు.

దివ్యజ్ఞాన బోధనలు కూడా రామలింగ బోధనలలాగే ఉంటాయి. నిజానికి రామలింగ స్థాపించిన సమరస వేద సన్మార్గ సంఘం పది సంవత్సరాల తరువాత 1875లో న్యూయార్కు నగరంలో స్థాపించబడిన దివ్యజ్ఞాన సమాజం వారి భారతదేశంలో ప్రతిరూపంగానే భావించవచ్చును. అంతర్భూతమైన విశ్వాత్మ, కర్మ, పునర్జన్మ ఆధ్యాత్మిక భ్రమణము అన్న హిందూ సిద్ధాంతాల ప్రత్యక్ష స్వరూపమే యీ విశ్వం అని ఉపనిషత్తుల సారాంశం. ఉపనిషత్తులలో ఉన్న ఆత్మజ్ఞానం అన్న సిద్ధాంతం నుంచే దివ్యజ్ఞానం వారి ఆధార సూత్రాలు గ్రహింపబడ్డాయి. అతి పరిశుద్ధతతోను, గొప్ప సాధనతోను, మానవుడు సర్వవ్యాప్తియైన ఆత్మతో ఐక్యం చెందగలడని హిందూ మతస్థులలాగనే దివ్యజ్ఞాన సామాజికులు కూడా నమ్ముతారు. మహాత్ములను, వేదపారంగతులను, ఉపదేశంతో, ఆత్మశక్తి ద్వారా, పొంది, దివ్యజ్ఞానము కలిగిన వారి ఉనికిని గుర్తిస్తారు వీరు. అన్ని మతముల ఏకత్వము, దాని సారాంశము, దివ్యజ్ఞానము యొక్క ఉనికి తెలియ చేయుట మహాత్ములు, పారంగతులు అయిన రామలింగ ఇదే బోధించేవారు. అన్ని మతాలు సత్యాన్ని తరచి శోధించి లోన పరికించితే ఒక్కటే వారు దీనిని వేరు చేసి సత్య సన్మార్గం లేక జగదాత్మ అన్న దీనినే పునాదిగా చేసుకొని ప్రతిమతం తమ తమ సాధాలకు ఇవన్నీ ఆడంబరాలనీ, అబద్ధాలనీ వారు తృణీకరించారు. వేద అంటే మతపరమైన అర్థం వస్తుందని ఆ మాట కూడా వారి సంఘనామం నుండి తీసివేసి దానిని సత్యసన్మార్గ సంఘం అని మార్చారు. సన్మార్గాన్ని వారు ఆత్మజ్ఞానంతో, యీ జీవితంతో యీ విశ్వంతో భగవత్సాన్నిధ్యం చేరేందుకు మార్గం అని అర్థం చెప్పారు. జీవులపై దయ, అచేతన జగత్తుపైన కూడా దయ జూపినప్పుడు అదే భగవంతుని అనుగ్రహం పొందడానికి ప్రథమ సోపానం అవుతుంది.

7 సెప్టెంబర్ 1875న న్యూయార్కు నగరంలో శ్రీమతి హెలెనా పెట్రోవ్నా బ్లావట్ స్కీ (1831-91) దివ్యజ్ఞాన సమాజం స్థాపించారు. టిబెట్టు నుంచి విజ్ఞులు పారంగతులు, ఉపదేశకులు, పలుమార్లు వచ్చి తమకు యీ బోదనా రహస్యాలను బహిర్గతం చెయ్యవలసినదిగా కోరినట్లు ఈమె చెప్పారు కలనల్ ఎస్. వాల్కాట్ ఈ సమాజానికి ప్రథమ అధ్యక్షులు, శ్రీమతి బ్లావట్ స్కీ మొదటి కార్యదర్శి.

శ్రీమతి బ్లావట్ స్కీ, శ్రీవాల్కాట్లు మద్రాసు విచ్చేసినప్పుడు రామలింగ ప్రథమ, ప్రధాన శిష్యులు తొజువూర్ వేలా యుధము దలియార్ మరి దర్శనానికి వెళ్లారు. ఆకాలంలో వేలాయుధము దలియార్ మరి దర్శనానికి వెళ్ళారు. ఆ కాలంలో వేలా యుధము దలియార్ మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీ తమిళ

పండితులుగా ఉండేవారు. వారు దివ్యజ్ఞాన సమాజం వారికి ఒక వివరణ పత్రం ఇచ్చారు. దానిని మద్రాసు, దివ్యజ్ఞాన సమాజ ఉపాధ్యక్షులు శ్రీ జి.ముత్తుస్వామి చెట్టి, జడ్జి, స్మార్కాస్ కోర్టు మద్రాసు వారు ఆమోదించారు. ఈ పత్రం Hints on Esoteric Theosophy అన్న పుస్తకంలో అచ్చయింది Theosophist అన్న పత్రికలో కూడా జూలై 1882 సంచికలో అచ్చయింది. తిరిగి అదే పత్రికలో సెప్టెంబర్ 1969 సంచికలో పునర్ముద్రితమయింది దాని నుండి కొన్ని భాగాలు యీ క్రింద యివ్వడమయింది

'Hints on Esoteric Theosophy' గ్రంధకర్త గారికి,

ఆర్యా,

నేను 'అరుళ్ ప్రకాశ వళ్లాలరె' సాధారణంగా వారిని చిదంబరం రామలింగ పిళ్లే అనే దక్షిణ భారతదేశంలో సుప్రసిద్ధులైన యోగీశ్వరులైన వారి శిష్యుణ్ణి, అని వినతి చేస్తున్నాను మహాత్ములు, పారంగతులు, ఉన్నారా అని సందేహం పాశ్చాత్య సమాజికులు, కొందరు భారతీయులు కూడా వ్యక్తం చేస్తున్నారని తెలిసి, నిజానికి దివ్యజ్ఞాన సమాజం వారి ప్రోత్సాహం మీదనే స్థాపించబడిందని; మహాత్ముల గురించి వారి పూర్వాపరాలను వాలా శ్రమ తీసుకొని సాక్ష్యాధారాలతో సమర్పించిన దానిని గురించి కూడా విన్నాను. ఈ సందర్భంగా మా పూజ్య గురువుల గురించి కొన్ని విషయాలను వెల్లడించదలచుకొన్నాను. దివ్యజ్ఞానం ఉత్తభ్రమకాదనీ, ఆ సమాజం అస్థిరమైన పునాదులపై స్థాపింపబడినదని నిరూపించి, వారిలోని అపనమ్మకాలను గట్టిగా తుడిచి పెట్టాలని నా నమ్మకం.

అటు తరువాత వారి జీవిత విశేషాలను గురించి కొంత చెప్పి, వారి వ్యక్తిత్వము, బోధనలు గురించి చెబుతూ వేలాయుధము దలియార్ యీ విధంగా కొనసాగించారు:

'1867లో వారు ఒక సమాజాన్ని స్థాపించారు. నిజమైన వేద సిద్ధాంతాలను ప్రచారం చెయ్యడానికి విశ్వమానవ సౌభ్రాతృత్వ సూత్రం మీద ఆధారపడిన సన్మార్గవేద సన్మార్గ సంఘం దాని పేరు.' సూత్రాలన్నీ దివ్యజ్ఞాన సమాజం వారి సూత్రాలేనని నేను వేరుగా చెప్పనక్కరలేదు. మా సమాజం అయిదారు సంవత్సరాల నుండి మాత్రమే పని చేస్తోంది. ఈ కాలంలో సభ్యులందరి ఖర్చుల మీద వేలాది బీద, అవిటి, ప్రజలకు అన్నదానం జరుపబడుతోంది.

1873 మొదటి అర్ధ సంవత్సరం విశ్వమానవ సౌభ్రాతృత్వం గురించి తమ అభిప్రాయాలను వారు తీవ్రంగా ప్రచారం చేశారు. కాని చివరి మూడు నెలలూ ఉపన్యాసాలు యివ్వడం నిలిపివేసి పూర్తిగా మౌనం అవలంబించారు. జనవరి 1874 చివరి రోజుల్లో తిరిగి యీ క్రింద పేర్కొన్న భవిష్యత్తును గురించి తిరిగి తిరిగి వక్కాణించారు. .. ఆ నెల 30 వ తేదీన ఆఖరి సారిగా మా గురువుగారి

దర్శనం చేశాం... తిరిగి దర్శనమిస్తామనీ, అయితే ఏకాలము, స్థలము, పరిస్థితులలో అది జరుగుతుందో చెప్పజాలనని మాకు మాట యిచ్చారు. అయితే, అప్పటి వరకూ భారతదేశంలో మాత్రమే కాక యూరోపు, అమెరికా దేశాలలోనే కాక మరికొన్ని ఇతర దేశాలలో కూడా పని చేస్తున్నట్లు చెప్పారు.

జీవితభాగం చివరి దశలో తరుచుగా వారు ఆశ్చర్యపోతూ ఉండేవారు.... "అసలైన విశ్వసౌభ్రాతృత్వ సభ్యులు సుదూరంలో భారతదేశానికి ఉత్తరంగా ఉన్నారు.... ఇదే విశ్వమానవ సౌభ్రాతృత్వ సందేశాన్ని రష్యానించీ, అమెరికానించీ, ఇతర విదేశాలనించీ వ్యక్తులు ఇక్కడకు వచ్చి ప్రచారం చేసే కాలం అట్టే దూరం లేదు . . . ."

వారి భవిష్యద్వాణి నా ఉద్దేశంలో ఇప్పుడు అక్షరాలా సఫలీకృతమయింది ఉత్తరాన మహాత్ములున్నారన్న సత్యం మాకు, హిందువులకు కొత్త సమాచారమేమీ కాదు. కాని శ్రీమతి బ్లావట్స్కీ, శ్రీవాల్కాట్‌లతో రష్యా అమెరికాలలో ఉన్న వారు రాబోతున్నారని అనేక సంవత్సరాల ముందుగానే వారు జోస్యం చెప్పారు. వివాదాలకు తావులేని సాక్ష్యాధారాలతో వారు ఆ మహాత్ములతో సంబంధం కలిగిఉన్నట్లు, తదుపరి ఆ మహాత్ముల సూచనలననుసరించి దివ్యజ్ఞాన సమాజం స్థాపించడం జరిగాయి. వేలాయుధముదలియార్ గారు వెలువరించిన యీ పత్రం మీద చాలా మంది తమకు శంకలు వ్యక్తం చేశారు. ముఖ్యంగా కొంతమంది పండితులు, పేరెత్తి చూపడం గురించి ఆక్షేపించారు.

The Thesophist జూలై 1882 సంచిక పై విషయం వ్రాయగా సంపాదకీయంలో ఈ విధమైన వ్యాఖ్య వెలువడింది :

ఒక ప్రత్యక్ష ప్రతిఘటనకు సమాధానంగా The occutt world వ్రాసిన కవి ఏప్రిల్ 1882 బొంబాయి గెజెటీర్‌కి వ్రాశారు. అందులో వారి నమ్మకం గురించి ఇలా చెప్పారు. 'The occutt world' అన్న పుస్తకం వ్రాసేనాటికే నేను వర్ణించిన పారంగతులతో గూడిన విశ్వసౌభ్రాతృత్వ సంఘంతో దివ్యజ్ఞాన సమాజానికి శ్రీమతి బ్లావట్‌స్కీ ద్వారా సంబంధం ఉందని నాకు గట్టి నమ్మకం ఉంది. అది ఆ విధంగా జరిగి ఉంటుందని యింకా గొప్ప, విస్తృతమైన జ్ఞానంతోనే నేను చెప్పగలను. "ఈ పంక్తులు వ్రాస్తున్నప్పుడు మన విశ్వాసపాత్రుడైన మిత్రుడు కొంచెమైనా ఆలోచించి ఉండడు, తను చెప్పిన దానిని ఖండించడానికి వేలాదిమంది సాక్షులు ముందుకు వస్తారని కాని సరిగ్గా అలాగే జరిగింది. కుశంకులు, ప్రతికూలవాదులు అయిన సాక్షులు వారి యిష్టం వచ్చిన రీతిని దూషించవచ్చు. కాని సత్యాన్ని అసత్యం చెయ్యలేరు మన మిత్రులు – మేము పిచ్చివారం, బూటక వేషధారులంకామని గుర్తించిన మిత్రులింకా ఉన్నారు. వారు యీ క్రింది ప్రకటన

చదివి ఆనందిస్తారనడానికి సందేహం లేదు .... పరిచయ సంభాషణ జరిపిన వారు వేసిన ప్రశ్నలన్నీ మాత్రమే కాక కొన్ని ఇతర ముఖ్యసత్యాలను కూడా వెలువరచడానికి మాకు స్వేచ్ఛలేదు. అవి కూడా వెల్లడించినట్లయితే మేము తరుచు అంగీకరిస్తూ ధృవపరిచినట్లు –

1. టిబెట్టు భారతదేశ జ్ఞానుల ప్రత్యక్ష సూచనలపైననే మా సమాజం స్థాపించబడింది అని;

2. వారి కోరికలను మన్నించి మాత్రమే బారతదేశానికి వచ్చాం అని చెపుతూన్న సత్యాలకు మరింత బలం చేకూరేది

వేలాయుధ ముదలియార్ యిచ్చిన వివరణ పత్రం తరువాత శ్రీమతి బ్లావట్‌స్కీ ఒక వ్యాఖ్యానం యివ్వగా దానిని The Theosophist జూలై 1882 సంచికలో పునర్ముద్రించారు.

రాబోవు ఘటనలను ముందుగా జోస్యం చెప్పడం అన్నది అన్నిటికంటే అతి స్వల్పమైన, పనికిమాలిన విశ్వాసాలకు తావిచ్చే సంఘటనలో ఒకటి. ఈ పత్రం వ్రాసిన గౌరవనీయులైన ప్రత్యక్ష సాక్షి యొక్క యోగ్యత, వారి గురువులు ప్రవచించిన సందేశాల ప్రచార విస్తరణ, ప్రజలలో ప్రబలిఉన్న చినవార్తవారికి చేరి ఉండవచ్చునన్న అసంభవమైన అభియోగం, లేదా ఆనాటి పత్రికలు, సంచికలు, వీటి నుండి దివ్యజ్ఞాన సమాజం భారతదేశంలో స్థాపించబడబోతోంది అన్న వార్త వారికి అంది ఉంటుందనీ – యివన్నీ కలిపి ఆలోచిస్తే రామలింగ యోగి నిజంగానే దివ్యజ్ఞాన సమాజం స్థాపించమని మమ్మాదేశించిన వారితో సంప్రదింపులు జరిపారనడానికి సందేహం లేదు.

1873 మార్చిలో రష్యా నుంచి ప్యారిస్‌కు వెళ్లమని మాకు ఆదేశాలు అందాయి. జూన్‌లో అమెరికాకు బయలుదేరమని ఆదేశాలు మాకు చేరగానే మేము అక్కడకు జూలై 6న చేరాము. ఇదే సమయంలో ముందు ముందు యిలా జరగబోతున్నాయి అని రామలింగ చిత్రిస్తున్నారు అక్టోబర్ 1874 వెర్మౌంట్‌లోని చిట్టెండర్‌కు వెళ్లమని మాకు ఆదేశాలు అందాయి. అది ఎడ్డీ కుటుంబం నివాస స్థలం. కలనర్ వాల్‌కాట్ వారి పరిశోధనలలో నిమగ్నులైయున్న కాలం అది. "మానవాతీత శక్తులకు వాస్తవ రూపాన్నివ్వడం" అన్నది వారి పరిశోధనాంశం. ఇది ఇప్పుడు ఆధ్యాత్మిక ప్రపంచంలో చాలా విఖ్యాతినొందింది. నవంబర్ 1875లో దివ్య జ్ఞాన సమాజ స్థాపన జరిగింది. అయినప్పటికీ 1878 వరకూ భారతదేశంలో నిమిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభం కాలేదు. వాటి ఫలితంగానే సమాజ ప్రధాన వ్యవస్థను ఫిబ్రవరి 1879లో బొంబాయికి తరలించబడింది. ఈ ప్రధాన కేంద్రాన్ని . 1882వ సంవత్సరంలో బొంబాయి నుండి మద్రాసుకు మార్చడమయింది.

# అధ్యాయం 20

# రామలింగని 'సత్యజ్ఞానము'

వారి జీవిత చరమకాలంలో రామలింగ 'మతం' అన్న మాటను నొక్కివక్కాణించి శాపంగావించడం, వారి బోధనలన్నిటి నుంచీ అన్ని మతాలను త్రోసి పుచ్చివాటి సారాన్ని మాత్రం 'సత్యజ్ఞానం'గా ఎంచి దానినే దివ్యజ్యోతిగా వారు సాధించారు. అందుకొరకే ఈ అధ్యాయానికి రామలింగని మతము అనిపేరు పెట్టలేదు ఆత్మ విద్య వల్లనే ఆత్మపరిజ్ఞానం లభ్యమవుతుందని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి

రామలింగ ఊహించిన దివ్యజ్యోతి ఋగ్వేదంలోని గాయత్రీ మంత్రంలో మనం దర్శించవచ్చును. ఇరువది నాలుగు అక్షర సముదాయపు పరిధిలో వేదసారాన్నంతా గాయత్రీ మంత్రం తనలో ఇముడ్చుకుందని సర్వసాధారణంగా గుర్తించబడింది మానవుడు తన ఆధ్యాత్మికాభివృద్ధిని సాధించడానికి అత్యున్నత ఆధ్యాత్మిక శోధన సాగించడానికి మానవునికి ఒక జీవిత కాలం సరిపోతుంది. అలాంటి ఆధ్యాత్మిక పరిశోధన ఇరువదినాలుగు అక్షర సముదాయమైన మంత్రంలో మూర్తీభవించి ఉంది.

1867లో రామలింగ సభాపతి శివాచార్య అను పదహారేళ్ల యువకుణ్ణి చిదంబరంలో కలుసుకున్నారు. ఆ యువకుడు గురువుగారిని చూడగానే ఆకర్షితుడయ్యాడు. 1869లో ఆతడు వడలూర్ వచ్చి అక్కడే స్థిరపడిపోయి, వారికి అత్యంత ముఖ్యుడైన శిష్యుడిగా రూపొంది, చివరకు రామలింగ నెలకొల్పిన 'సత్యమందిరం'లో అంటే సత్యజ్ఞాన సభలో పూజారిగా అయ్యారు. వడలూర్‌లో మొదటి రోజుల్లో రామలింగను కలుసుకున్నప్పుడు గాయత్రిని గురించి బోధపరచమని రామలింగను శివాచార్య అర్థించారు. అప్పుడు రామలింగ ఇలా చెప్పారు –

ఋగ్వేదంలోని మంత్రం గాయత్రి లేదా సూర్యగాయత్రికి రెండు స్థాయిలలో అర్థం ఉంది. మొదటిది రెండవ దానికి వివరణనిచ్చేదిగా ఉంటుంది. అదే మంత్రం

యొక్క ముఖ్యార్థం :
అందరినీ జీవితమంతా మేల్కొలుపువాడైన సూర్యుని దివ్యతేజస్సును ధ్యానించుదాం. సర్వప్రాణుల చైతన్యము, మేధస్సు (బుద్ధి)ను వెలిగించు అత్యున్నత తేజస్సును ధ్యానించుదాం.

సాధకుడు అంతర్భూతుడైన భాస్కరుని, అంతర్గతమైన చైతన్యమనే తేజస్సును నిత్యమూ ధ్యానించాలి. అంతర్గత చైతన్యం అవస్థాత్రయం అనగా జాగ్రవావస్థ. అర్ధ జాగ్రహావస్థ, సుషుప్త్యావస్థ యీ మూడింటిలోనూ పట్టి విడువకుండా ఉంటుంది. దాని ప్రతిరూపమైన సూర్యుడు బాహ్యప్రపంచంలో ఉన్నాడు. ఈ అంతర్గత చైతన్యమే జీవిక అంతటికీ సారాంశం యొక్క మూలం.

బృహదారణ్యకోపనిషత్తు (7వ బ్రాహ్మ లేదా భాగం, మూడవ అధ్యాయం) నుండి యీ క్రిందనుదహరింపబడిన భాగం గాయత్రీ మంత్రమును అర్థం చేసుకోడానికి ఉపకరిస్తుంది. ఇది చాలా ఉత్కృష్టమైనవని పేరు పొందాయి.

ఆదిత్యుని యందు ఎలువాడు, ఆదిత్యుని లోపలనే, వాని నాదిత్యుడెరుగడు.
వాని దేహమాదిత్యుడు, అతడే ఏలును లోపలి ఆదిత్యుని అతడనీజీవి, అంతర్యామి, అమరుడు.
చంద్రతారకల యందుండువాడు, చంద్రతారకలలోపలనే, వానిని చంద్రతారకలెరుగవు.
వానిదేహము చంద్రతారకలు, అతడే ఏలును లోపలి చంద్రతారకలను, అవియేనీజీవి అంతర్యామి అమరుష
తమస్సు యందుండువాడు, తమస్సులోనే యుండువాడు, వానిని తమస్సు ఎరుగనివాడు, వాని దేహము
తమస్సు, అతడు ఏలును లోపలి తమస్సును, ఆతడు నీజీవియే, అంతర్యామి అమరుడు
తేజస్సు నందుండువాడు, తేజస్సులోనే యుండువాడు, వానిని తేజస్సు ఎరుగనివాడు
వాని దేహము తేజస్సు, ఆతడేలును లోపలి తేజస్సును, ఆతడేనీజీవి, అంతర్యామి అమరుడు
అన్ని జీవుల యందుండువాడు, అన్ని జీవులలోనే యుండువాడు, వానినన్ని

జీవులెరుగని
వాడు, వాని దేహమన్ని జీవులు, ఆతడేలు లోపలి అన్ని జీవులను, ఆతడేనీజీవి, అంతర్యామి అమరుడు
మనసునందుండువాడు, మనసులోనే యుండువాడు, వానిని మనసు ఎరుగని వాడు, వాని
దేహము మనసు, ఆతడేలును లోపలి మనసును, ఆతడేని జీవి, అంతర్యామి, అమరుడు.
విజ్ఞానమునందుడువాడు, విజ్ఞానములోనే యుండువాడు, వానిని విజ్ఞాన మెరుగనివాడు,
వాని దేహము విజ్ఞానము, ఆతడు ఏలును లోపలి విజ్ఞానమును, ఆతడేనీజీవి, అంతర్యామి, అమరుడు. (అను మేక్స్ముల్లర్)

ఇదే భావం మరింత బలంగా తైత్తిరీయోపనిషత్తులో పరుపబడింది

మానవునిలో నుండువాడు, ఆదిత్యునిలో నుండువాడు ఒక్కడే. ఈశావాశోపనిషత్తు (శ్లో16) లో యీ శ్లోకంనించి గాయత్రి మంత్రం మరింత అర్థాన్ని సేకరించుకున్నది.

ఓ పోషకుడా, తాపన మాత్రుడా, అన్నిటిని అదుపులోనుంచు
ఓ వెలుగునిచ్చు సూర్యదేవా, మూలాధారమునీవు
జీవులందరికి, నీ కాంతి నిలుపుము, కూడ దీయుము
నీ కిరణములన్ని, నే చూడనా, నీయనుగ్రహము
వలన, నీ అతి పవిత్రమగు రూపము, ఆ పరమాత్మ
అందుండునది – ఆ పరమాత్మను కూడనేనే.

సాకార ప్రాణికోటికి ఆధారాన్నీ ఉత్తేజాన్ని ఇచ్చేది ఆదిత్యుడు, ఆత్మజ్ఞానానికి మూలం జీవితానికే, ఆదిత్యునికీ కూడా అన్న గాయత్రి యొక్కయీ రెండు సమానాంతర భావార్థాలూ, తైత్తిరీయో పనిషత్తులోనివే.

సర్వచింతనలకు, ప్రాణులకు, చలనానికీ ఆ మూలకారకుడు ఆ పరబ్రహ్మమేనని ధ్యానించవలెను. అతడు ఐశ్వర్యములో శోభాయమానుడు, తారలలోకాంతి. సమస్తము అతడే !

(అను : స్వామి ప్రభవానంద మరియు ఫ్రెడరిక్మాంచెస్టర్)

పరబ్రహ్మను ధ్యానించుటకు గాయత్రిని మించిన పరమాద్భుత మంత్రం

మరొకటిలేదు. మానవు డెట్లూహించుకుంటాడో తానట్లే రూపొందుతాడు. గాయత్రిపైన, ఆత్మపైన అంతర్జ్యోతి, బాహిరజ్యోతులుగా ధ్యానించవలసినదని ఆదేశించబడింది. దీని ద్వారా మానవుల ఆలోచనలు పరిశుద్ధమవుతాయి. అవి ఉన్నతస్థాయికి ఎదుగుతాయి.

భగవంతుని కనుగొనే శక్తిని పెంపొందించుకోవడానికి తొలి రోజులలో రామలింగ ఒక అద్దం ముందు జ్యోతిని ఉంచి ధ్యానం చేసేవారు. తరువాత అలాంటి అద్దాలు వడలూర్ మందిరంలోను, సిద్ధివి లక్కం గృహంలోనూ కూడా ఏర్పాటు చేయించారు. మూర్తీభవించిన ఆత్మలోని, బ్రహ్మన్ని అద్దంలోని ప్రతిబింబాన్ని చూచినట్లు స్వచ్ఛంగా కనుగొనవచ్చునని కఠోపనిషత్తు చెపుతున్నది. దాని అర్థం మానవుని ఆత్మ అద్దంలో ప్రతిబింబించే మిథ్యా బింబం మాత్రమే కాదు. తనలో అంతర్గతమైన ఆత్మను ప్రతిబింబింప జేయుటకై ఆత్మవసించే దేహానికి ఉండవలసిన స్వచ్ఛతను గురించి ఇది చెబుతున్నది. ఆత్మవాసం చేయడానికి ఎంచుకున్న దేహానుకూలం మీద యీ స్వచ్ఛత ఆధారపడి వుంటుంది ఉదాహరణకు మానవుడు అన్ని విధాల శునకము కన్నా తగినవాడు : ఇది కాక.

> అద్దంలో లాగనే (పరబ్రహ్మమును విశదంగా చూడవచ్చును)
> ఈ దేహంలో కూడా; ఒక స్వరంలో లాగనే, పితరుల ప్రపంచం
> లో; నీటిలోవలెనే, గంధర్వలోకంలో ఆతడు కనిపించును
> వెలుగు నీడలలో వలెనే అనగా చీకటి నుండి వెలుతురును
> చూడ గలిగి నంత స్పష్టంగా బ్రహ్మలోకంలో
>
> (కఠోపనిషత్తు : వల్లి 6 శ్లోక
> అను : గ్రంధకర్త)

దేహము - జ్యోతి భావన సరిగ్గా అర్థం చేసుకోవాలంటే తిరిగి ఉపనిషత్తులలోకి వెళ్లాలి.

> అద్దంలాగా సహజంగా తళతళ మెరుస్తున్నా ధూళిపడి మరకలు
> అవుతాయి, అది శుద్ధం చేస్తే తిరిగి మెరుస్తుంది. ఆలాగే దేహి
> అయినవానికి ఆత్మజ్ఞానం యొక్క తత్వం స్పష్టంగా చూడగానే తన
> కార్యసిద్ధించిన వానిగా అవుతాడు, చింతలకు దూరమవుతాడు.

యోగసిద్ధి సాధించినపుడు పరబ్రహ్మం యొక్క నిజతత్వాన్ని అంతరాత్మ యొక్క నిజ తత్వం ద్వారా తెలుసుకోగలుగుతాడు. దీనిని ఒక జ్యోతి, తరువాత పరమాత్మను తెలుసుకోవడంతో పోల్చవచ్చును. జన్మించినది స్థిరమైనది, గుణరాహిత్యమైనది, అన్ని బంధాలనుండీ విముక్తి పొందినది.

(శ్వేతాశ్వతరోపనిషత్తు II- 14, 15
అను : టి.ఎన్.పి. మహాదేవన్)

పరబ్రహ్మతత్వానికి సరియైన భావ ప్రకటన స్వచ్ఛమైన, సర్వోత్కృష్టమైన, తాత్వికవి చార సారాంశం అన్ని గుణాలకూ, అన్ని పరివర్తనలకూ, కృత్రిమవేషధారణలకూ, అతీతం, స్వయంప్రకాశం, స్వతంత్రం అయిన ఏకైక విశ్వజనీన సత్యం. సత్ చిత్ ఆనందం తేజస్ లేదా జ్యోతి అన్న మాటలలో వ్యక్తీకరింపబడింది. వీటిలో మొదటిది మూడు మాటలతో కలిసి ఉన్నది. వానిలో సత్ అన్న మొదటి మాటకు పరిశుద్ధ జీవి అని కేవలమైన ఉనికి, ఆత్మ ఉన్నది అని అర్థం చెప్పవచ్చు. చిత్ అనునది స్వచ్ఛమైనచై చైతన్యము, స్వచ్ఛమైన బుద్ధి, స్వచ్ఛమైన జ్ఞానం. ఇక 'ఆనంద' అంటే స్వచ్ఛమైన బ్రహ్మానందం. తేజస్సు అనే రెండవ మాట తేజస్సు లేక జ్యోతి. ఇది వర్ణనతో కూడి వున్న మాట. వెలుతురు, ప్రకాశం, యివి సరైన అర్థాన్వియవు. మేక్స్‌ముల్లర్ యీ విధంగా చెప్పారు. తాత్విక విచార పరిభాషలో పరబ్రహ్మమునకు అతి దగ్గరగా చేరగలిగిన దానిని 'తేజస్సు' అని సంబోంధించడమే. ఎందుకంటే అది చైతన్యమైన తేజస్సు గనుక. 'చిత్' అన్న మాట ఇక్కడ మేక్స్ ముల్లర్ చైతన్య తేజము అనీ అనువదించారు. దానినే బుద్ధి అనే తేజస్సు అని కూడా అనువదించవచ్చు. లేదా జ్ఞానం యొక్క తేజస్సు అని కూడా చెప్పవచ్చు. మండకోపనిషత్తులో యీ విధంగా చెప్పబడింది. ( 9, 10)

అత్యున్నతముగ ప్రకాశించు ఆచ్ఛాదనలో నిర్మలమూ సర్వోత్కృష్టమూ అయిన పరబ్రహ్మం నిలచి యున్నది. అది స్వచ్ఛం, అన్ని కాంతులకూ ప్రకాశాన్నిచ్చేది. ఆత్మ చెరుంగు వారికి ఎరుక అయినది. అచట సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు, తారకలు కూడ. ఈ మెరుపులు కూడ. మరియీ అగ్ని అసలే జ్వలించదు. పరబ్రహ్మం

ప్రకాశించునపుడు అతని వెనుక ప్రకాశించును; అతని కాంతిలో
ఇవి అన్నియు వెలుగొందును.

(అను : మేక్స్ ముల్లర్)

వేదాంతవేత్త, కవి అయిన భర్తృహరి గాయత్రి బోధనలను చక్కగా క్రోడీకరించి అంటారు.

ఇవే సాష్టాంగ ప్రణామములా పవిత్రకాంతికి (జ్యోతి, తేజస్సు)
దాని రూపము చిత్, పరిపూర్ణము, కాలము, ప్రదేశములతో
నిమిత్తము లేనిది, దానిని గ్రహించుట స్వయంగా అనుభవించుట
ద్వారా మాత్రమే.

బుద్ధిని రామలింగ జ్యోతిలోపలి జ్యోతి లోపలి జ్యోతి అని వర్ణించారు. (జ్యోతియుత్ జ్యోతియుత్ జోతి). అన్నిటికంటె పైనున్న దివ్యక్తాత్మ, తరువాతది కరుణాత్మ, అన్నిటికంటే మధ్య వున్నది పరమాత్మ. వ్యక్తాత్మ, కరుణాత్మ ద్వారా పరమాత్మ ద్వారాను వెలుగొందుచున్నది అని అర్థం.

# అధ్యాయం 21

# రామలింగ పద్య సాహిత్యం

తేనెటీగ తేనె రుచి చూచేవరకే పూవు చుట్టూరా తిరుగుతూ రొదచేస్తుంది. తేనె చవిచూసిన వెంటనే రొద చేయడం నిలిపి వేస్తుంది అన్నారు రామలింగ.

సిద్ధులు, మతప్రవక్తల విషయం కూడా సరిగ్గా ఇలాగే వుంటుంది. ఆ దివ్యత్వంతో తాదాత్మ్యం అనే నిశ్శబ్ద తన్మయత్వంలోకి వారు తమను తాము సమర్పించుకుంటారు. వారిని మాటల్లోకి దింపడానికి ముందుగాని, తరువాతగాని, వారినుండి వచ్చేది – అన్ని సందర్భాలలోనూ పద్యాలుకావు. అది అత్యున్నత కవితా సాహిత్యమూ కాదు. దీనికి సరిగ్గా విరుద్ధంగా సిద్ధులకు బదులు కవులు మాటలు ఆకర్షణకు గురియై చెప్పనలవికాని విషయాలకు రూపం కల్పిస్తారు. అదేవిధంగా సిద్ధులు కవిత్వంవైపు ఆకర్షితులైతే, తరచుగా పవిత్రమైన మాటల సందోహంలో వివశులౌతారు. లేదా చిన్నచిన్న నీతికథలు చెప్పే సులభమార్గాన్ని అవలంబిస్తారు. ఈ కథలు చాలావరకూ సుబోధకాలుగా వుంటాయి. కాని యిది పద్యసాహిత్యంకాదు. అయితే గొప్ప కవులు, వారి దృష్టిని వ్యక్తం చేస్తున్న సందర్భాలలో తమ ఊహాదృశ్యాలకు సాకారం కల్పిస్తూ శాశ్వతానందాన్ని సుందర విషయాలకు, రూపలక్పన చేస్తారు. ప్రవక్తల సూక్తులలో వివిధ మార్పులతో కూడిన పద్య సాహిత్యం సుందర విషయాలకు, రూపకల్పన చేస్తారు. ప్రవక్తల సూక్తులలో వివిధ మార్పులతో కూడిన పద్యసాహిత్యం కనబడుతుంది. జీసస్ పద్యాలను మనం గుర్తుపట్టగలుగుతాం. బుద్ధుని పద్యాలు మనం గుర్తుపట్టగలుగుతాం. కాని వాటిని షేక్స్‌పియర్ లేదా మిల్టన్, లేదా వాల్మీకి, కాళిదాసుల పద్యాలతో పోల్చాలని ఎవరూ అనుకోరు.

రామలింగ ఒక అద్వితీయమైన ఉదాహరణ. వారు బుద్ధుడు, రామకృష్ణులవలెనే తేజోపుత్రులలోనేకాక కీట్స్, షెల్లీ, బ్లేక్, టెన్నిసన్ వంటి గొప్ప కవితా పుత్రులు అత్యున్నతస్థాయి నందుకొన్ననాటి వారి కోవకూ చెందుతారు. వారు ఉచ్చరించినది

స్వచ్ఛమైన స్వరమాధుర్యం. వీరితోనేకాక, భాషయొక్క పరిధులను, శక్తిని పెంపొందించిన మార్గదర్శక కవుల కోవకు కూడా చెందుతారు. వారివారి విస్తృతమైన రచనలలో, మనదేశంలోనే కొందరు మహాభక్తులు పరిపక్వత చెందిన రచనలు, అప్పుడప్పుడు కొన్ని పద్యాలు వ్రాశారు. కాని పరిపూర్ణక కళాస్వరూపంతో ఉట్టిపడే రామలింగ రచనలతో పోల్చదగినవి ఎక్కడాలేవు. నా పరిధిలో రామలింగవంటి గొప్ప కవిని, సిద్ధుని, ప్రవక్తను నేనెరుగను. వారి పాటలు, పద్యాలలోని 'దేహ రహిత ఆనందం' యొక్క ఉనికికి నిదర్శనం. మహాత్ముల వాక్కులను లెక్కచేయని సిద్ధుల వేదాంత పరిశోధనలు, ప్రయాసలపైన సానుభూతిగాని, ఆ ఆలోచనలయొక్క మార్గం, సరళి, సిద్ధుల భావనలు కిట్టని వారు సహితం, రామలింగ పద్యాలను సాహిత్యంగా ఆనందించగలుగుతారు. ఆయన మాటలలోని మంత్రశక్తి అటువంటిది. వారి వాక్కులలో ఉన్నది వశీకరణ శక్తి అప్రయత్నంగా, అశువుగా, అత్యున్నత కావ్యపటిమతో, స్పందించే సున్నితత్వంతో మానవత్వాన్ని ఆధ్యాత్మికతను సంయోజన పరిచేటంతటి తీవ్రంగా వారిలో నడిచే ఆలోచనా ప్రవాహాన్ని వెతుకుతూ ఒక్కమాటగాని, ఒక్క పాదంగాని, సంకోచంగాని సందేహంగాని లేకుండా, వారి పద్యాలను మానవ దృక్పథంతో చదువవచ్చును. పెన్నిసన్ గురించి లూయియీ అంటర్ మేయర్ చెప్పిన వాక్యాలు రామలింగకు సరిగ్గా సరిపోతాయి. అవి శబ్దంలోని అతి సున్నితమైన మాధుర్యాలను గ్రహింపగల శ్రవణేంద్రియం తక్కువ మంది కవులకు ఉంటుంది. అందులో మరి కొద్దిమంది రచనలలోని ఆనందం సాటిలేని అతిరమ్యమైన శైలి సాటిలేని సంగీతాన్ని, దాటి ఎవరూ ముందుకుపోలేరు.

నవ్యతమిళ పద్య వాఙ్మయానికి రామలింగ మార్గదర్శకులు. ఆయన వారసునిగా చెప్పదగిన సుబ్రహ్మణ్య భారతి (1882-1921) సుప్రసిద్ధ కవి, దేశభక్తుడు కంటె ముందుకాలంలో జీవించారు. రామలింగ వారిది పూర్తిగ భిన్నమైన, విస్తృతమైన స్వరూపం. వారి తేజోపూరితమైన రచనలలో భారతి తమ కవితా జ్యోతిని వెలిగించినట్లుగా మనం చూస్తాం. ప్రవాహంలాగ సాగే తమిళానికి గురువు రామలింగ, కొత్తగతులకు, ఛందస్సులకు, వృత్తాలకు, కూర్పులకు, శబ్ద సౌందర్యాలకూ తండ్రి వంటి వారి నుండి భారతి కావ్యపితరులుగాను, తమిళ భాష పునరుద్ధారకులుగాను వారిని పూర్తిగా ఆకళించుకున్నారు. తమిళ పండితుడు,

విమర్శకుడు అయిన ఆర్.ఎస్.దేశిక్ యిలా వ్రాశారు. (తమిళంలో వ్రాసినది ప్రస్తుతం గ్రంధకర్త అనువదించినది) : 'కొత్తకొత్త ఛందస్సులు, వృత్తాలు, కొత్త సంగీతం తమిళులకు రూపొందించిన రామలింగను తమిళ ప్రపంచం ఎన్నటికీ మరువలేదు. భారతి గారిని క్షుణ్ణంగా చదివిన విద్యార్థికి, వారు యీ శకానికి ప్రథముడైన కవి రామలింగ వేసిన మార్గదర్శకమైన బాటపై అతి విశ్వాస పాత్రంగా అనుసరించారని విశదమవుతుంది.

క్లుప్తంగా చెప్పాలంటే, ఆధునిక తమిళ భాషా పునరుజ్జీవనానికి రామలింగ మొదటివారు. దానికి నవ చైతన్య గాత్ర సుబ్రహ్మణ్య భారతి. రామలింగ, భారతి వీరి సామ్యానికి దృష్టాంతాలు. గాంధీ, నెహ్రూ, రామకృష్ణ, వివేకానంద. ఈ బోణీలోని వ్యక్తుల సాపేక్షమైన ఔన్నత్యపు విలువలు, దీనివల్ల మనకు అర్థమవుతాయి.

రామలింగ పద్యసాహిత్యం యొక్క గొప్పతనం గురించి వారి ప్రధాన శిష్యులు తొజువూర్ వేలాయుధ ముదలియార్ (తమిళంలో) వారికి నివాళులర్పిస్తూ యిలా వర్ణించారు.

ఎటుల నిర్వచింతునా గురువుల కృపావచనముల
ఆ అమృతధారయగు రామలింగ ప్రవచనములు?
అందునా దాని పోవుచేసిన సారాంశ మాకాశమునదని,
పరువము ఆపండుదని, తీయదన మాతేనెదని,
చక్కెర వెక్కసముగాకుండ, రసము చెఱకునదని,
లేక ద్రాక్షరసము బయల్వడునట్లు, ఉత్తేజితము ఉధృతము
ఉక్కిరిబిక్కిరి చేయు దేహము, ఇంద్రియ గుణములు మరియు ఆత్మ
విజ్ఞానము యొక్క బ్రహ్మానందము పంజరము నుండి పైకెరుగునా?

## అధ్యాయం 22

# రామలింగ జీవితంలోని ముఖ్య సంఘటనలు

### (కాల నిర్ణయ క్రమంలో)

1823 అక్టోబర్ 5: దక్షిణ ఆర్కాట్ జిల్లా చిదంబరంలోని మరుదూర్‌లో జననం.

1824 మార్చి : చిదంబర దేవాలయంలోని నటరాజస్వామి దర్శనానికి తల్లిదండ్రులు తీసుకెళ్లారు. వారి మనసులో ఆ దృశ్యం శాశ్వతంగా ముద్రింపబడింది.

ఏప్రిల్ : తండ్రి రామయ్య పిళ్లే మరణం.

జూన్ : తల్లి చిన్నమ్మ మద్రాసు సమీపంలోని చెంగల్పట్టు జిల్లా పొన్నేరి గ్రామం చేరుకున్నది. కొద్ది కాలం తరువాత సభాపతి వద్దకు చేరుకున్నారు.

1828 : సోమరితనంగా తిరగడం వల్ల అన్నగారు ఇంటివద్ద అన్నం పెట్టడానికి నిరాకరించారు. కొద్ది కాలం పాటు రామలింగ యువ సన్యాసిగా మారారు. ఆ సమయంలో వారి అన్నగారి భార్య పార్వతి రహస్యంగా ఆయనను జాగ్రత్తగా సాకారు. కొద్ది కాలంలోనే ఆమె భర్తకు నచ్చజెప్పి రామలింగను తిరిగి ఇంటికి రప్పించగలిగింది.

1832 : తనిహై దేవాలయం వద్ద ఒక అద్దంలో రామలింగకు మురుగ దేవుని దర్శనమైంది. అప్పటి నుండి ఆయన సర్వావస్థలయందూ దైవదర్శనా జ్ఞానం కలిగి వున్నారు. పాటలు వ్రాయడం మొదలు పెట్టారు. వారి మొట్టమొదటి పాట మదరాసు కందస్వామి దేవాలయంలో ఉన్న కందస్వామి (మురుగన్) మీద వ్రాసినది.

1835 : రామలింగలో ఆధ్యాత్మిక చింతన ప్రారంభమయింది. వారు

త్యాగరాజు స్వామి వారి పై కీర్తనలు వ్రాశారు. శివుని త్యాగదర్శన రూపమే త్యాగరాజస్వామి అవతారం. తిరువయ్యారు దేవాలయం మద్రాసుకు పదికిలోమీటర్లు ఉత్తరంగా ఉన్నది

1849 : తరువాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తమిళ పండితుడైన వేలాయుధ ముదలియార్, తొజువూర్ నివాసి రామలింగ శిష్యుడైనారు.

1850 : అక్కగారైన ఉన్నములై అమ్మాళ్ కుమార్తె ధనమ్మాళ్‌తో రామలింగ వివాహం జరిగింది.

1851 : స్వామి కన్నుడయవళ్లాల్ గారి స్వవిజ్ఞాన బోధిని (ఒళివిల్ – ఒడుక్కం) రామలింగస్వామి గారిచే కూర్చబడిన గ్రంథం సభాపతి ముదలియార్ అచ్చువేశారు.

1854 : రామలింగ వచన గ్రంథం మనుమురై – కందవాచకం (ధర్మము – ఒక కద్పమతబోధనా సంస్థ కోసం పాలయంసుబ్బిరాయ చెట్టియార్ ముద్రించారు.

1855 : తొండమండల శతకం (తొండ మండలం మీద నూరు పాటలు పది క్కాశార కవి విరచితం, రామలింగ కూర్చిన గ్రంథ రూపంగా వెలువరించినది. కొమ్మూరు అయాస్వామి ముదలియార్ ముద్రించారు.

1858 : త్రోవలో సీర్కాజి, వైదీశ్వరర్ కోయిల్ వంటి పుణ్యక్షేత్రాలు దర్శించుకుంటూ రామలింగ మద్రాసు నుండి తరలి వెళ్లి మురుదూర్ సమీపంలోని కరుంగుజి చేరారు. వారి అన్నగారైన కరుంగజివాసి పరశురాంపిళ్లే మరణించటం చేత రామలింగ ఆవూరు వెళ్లి వెంకటరెడ్డియార్ ఇంట అతిథిగా వుండి, చిదంబరు ఆదిక్షేత్రాలు దర్శిస్తూ వుండేవారు

1865 : సమరస వేద సన్మార్గ సంఘం (Society for Religious Hormony in Universl Selfhood) రామలింగ స్థాపించారు

1867 జనవరి 16 : తిరుప్పాలియూర్‌లో పన్నై నది ఒడ్డున బ్రహ్మసమాజ ముఖ్యులలో ఒకరైన శ్రీధరస్వామి నాయకర్‌తో గోష్ఠి జరిపారు.

ఫిబ్రవరి 2 : చిదంబరానికి సుమారు ముప్పై కిలోమీటర్లు దూరంలో వడలూర్ గ్రామవాసులు నలభై మంది బీదలకు అన్నదాన గృహానికి నూట ఏభై ఎకరాల భూమిని రామలింగకు దానం ఇచ్చారు.

ఫిబ్రవరి : 'తిరు అరుల్ పా' అనే మొదటి నాలుగు సంపుటాలు రామలింగ రచనలలోని పద్యాలు (అనుగ్రహము అనే పవిత్ర గ్రంధము) తొజువూర్ వేలాయుధ ముదలియార్ వెలువరించారు. ఇరుక్కంవాసి రత్నముదలియార్, పాండిచ్చేరి వాసి వేలూముదలియార్, సెల్వరాయపురవాసి శివానంద ముదలియార్ వీరందరి అకుంఠిత దీక్ష వల్ల మైలాపూర్ నివాసి సోమసుందర చెట్టియార్ ధన సహాయంతో యీ పని సాధ్యపడింది.

మే 23 : సమరస వేద ధర్మశాల (Free Eating House of the brotherhood of Religious) ప్రారంభించారు. ప్రారంభోత్సవ సమయంలో రామలింగ ప్రబోధల జీవకారుణ్య ఒజుక్కం – జీవకారుణ్య నీతి (The law of compassion) వెంకట సుబ్బ దీక్షితర్ చదివారు.

సన్మార్గ బోధిని (School for the common Path of Religious) సన్మార్గ వివేక వృద్ధి (Orientation to the Common Final Path) ప్రారంభిద్దామని రామలింగ పధకం వేశారు. రెండు పధకాలూ ఫలించలేదు. రామలింగ కరుంగుజి నుంచి వడలూర్‌కు మకాం మార్చారు.

1869 : సభాపతి శివాచార్య రామలింగను వడలూర్‌లో కలుసుకున్నారు. తరువాత రామలింగ స్థాపించిన సత్యజ్ఞాన సభ (Half of Pure Truth)కు ప్రధమ పూజారిగా

నియమితులయ్యారు. రామలింగ అరుత్ పెరుంజ్యోతి అహవల్ – పరమోన్నత దిద్యతేజోకటాక్షాన్ని గురించిన ధ్యానగీతిని (Hymn to the Supreme Effulgent Gruce) మొదటిసారిగా అచ్చువేసినది కూడా శివాచార్యులే.

1870 : వడలూర్ నుండి రామలింగస్వామి సమీపంలోనే వున్న మెట్టుకుప్పంకు నివాసం మార్చారు. అక్కడే నిర్మించిన ఒక గదిలో తమ నివాసం ఏర్పరచుకున్నారు దానిని వారు సిద్ధి విలక్కం – పావన గృహం (House of Salvation) అని పిలిచే వారు.

1871 జూన్ : సమరస శుద్ధ సన్మార్గ సత్యజ్ఞాన సభ దీన్నే చిన్న మాటలో కుదించి సత్యజ్ఞాన సభ (Half of Pure Truth) (అని కూడా అంటారు) కు వడలూర్‌లో నిర్మాణ కార్యక్రమం ప్రారంభమయింది. మెట్టుకుప్పంలోనే ఉంటూ రామలింగ ఈ నిర్మాణ పర్యవేక్షణను చేస్తూ ఉండేవారు. అన్నదాన గృహాన్ని కూడా స్వయంగానే చూస్తూండేవారు. క్రమంగా అంతర్ముఖులౌతూ తీక్షమైన యోగ విధులను అవలంబించడం మొదలు పెట్టారు.

1872 జనవరి 11 : సన్మార్గవేదపాఠశాల (School for the Common Path fo Religions) ను ప్రారంభించాలని రామలింగ సంకల్పించారు. కాని అది సాధ్యపడలేదు.

జనవరి 25 : సత్యజ్ఞాన సభ (Half of Pure Truth) ప్రారంభం ఆ సమయంలో దీని ఉద్దేశాలు, ఆదర్శాలు తెలుపుతూ రామలింగ ఒక చిన్న పుస్తకాన్ని విడుదల చేశారు. రామలింగ తిరువరుళ్ మెయింమొఝి –కృపాకటాక్ష మార్గమునకు కొన్ని ఆదర్శ వాక్యాలు (Words on the path to Grace) అన్న ఉపన్యాసాన్ని ఇచ్చారు.

మార్చి 9: అన్నదానగృహంలో తన శిష్యుల నడవడికను గురించి మందలిస్తూ రామలింగ తమ ఆక్షేపణను అందచేశారు.

ఏప్రిల్ 18 : అరుళ్ పెరుంజ్యోతి అహవల్ - అఖిలాండ కృపాజ్యోతికి స్తోత్రగీతి (Hymn to the Supreme Light of Grace) పూర్తి అయింది.

జూలై 18: సత్యజ్ఞాన సభ నడిపే విధానానికి సంబంధించిన అన్ని సూచనలు రామలింగ వివరంగా ఇచ్చారు. అన్నిమతాలకూ సంబంధించిన పదములను వర్జించుతూ పరిశుద్ధ సత్యం అనే భావనతో సరిపోయేటట్లు తాను స్థాపించిన సంస్థల పేర్లను యీ విధంగా మార్చి వేశారు.

1. " సమరస వేద సన్మార్గ సంఘం " నకు బదులుగా 'సమరస శుద్ధ సన్మార్గ సత్య సంఘం' అని

2. 'సమరస వేద ధర్మశాల కు బదులుగా 'సమరస శుద్ధ సన్మార్గ సత్య సంఘం' అని

నవంబర్ 25 : సిద్ధి తిలకంలోను, అన్నదాన గృహంలోను, ఉంటూన్న తన అనుయాయుల నడవడికను గురించి ఒక ఆక్షేపణను పంపించారు.

1873 అక్టోబర్ 22 : మానవుని ఆధ్యాత్మిక పరిపక్వతకు చిహ్నంగా పతాకాన్ని ఎగురవేసేటప్పుడు గొప్ప ఉపదేశాన్ని (పురూప దేశం ) సిద్ధి విలకం దగ్గర ఇచ్చారు సత్య జ్ఞాన సభ మూసి వేశారు.

నవంబర్: గురుతుగా గదిలో ఉంచిన జ్యోతిని తీసి వెలుపల పెట్టారు. ధ్యానించవలసినదిగా ప్రజలను ఉద్బోధించారు. ఆజ్యోతిని సాధనగా ఎంచి పరమేశ్వర కటాక్షమునకై, వారు తలుపులు లోన గడియ వైచుకొని ఉండిపోయిరి.

1974 జనవరి 30 : రామలింగ నిర్యాణం.

ఆ సమయ మాసన్న మాయెను
ఆ సమయము నీయను గ్రహమందినదిగాన
ఆలకింపుము, పవిత్ర మూర్తీ,
నే నిజము వచింతును
అందించువాడవు సర్వశ్రేయస్సును
నే విడనాడితికపట నాటక మంతయును
వినమ్రుడ నే వేచియుందునే ఆ
నీ కటాక్షమొసగు వేళకు
నేనరిగితిని
వివాదములు దాటి
వాదకులదాటి
నా రక్తములోని ఉడుకు చల్లారినది
హింసయు మోసమును
నేవర్జించితిని
నా సమయమాసన్నమాయెను
ఆచార కర్మక్రియలు
నే శపధము చేసి విడనాడితిని
వదరుబోతు మర్కటము మనసును
నేనదుపులో నుంచితిని
నా చర్యలు బూడిదగా
నే మండబెట్టితిని
అద్భుతము యొక్క గారడి
నే తెలుసుకొంటిని
నీ కటాక్షమొసగువేళ
ఆసన్నమైనది
క్రోధము, కామము
నేపరత్యజించితిని
అహమ్మది దుమ్మెత్తిపోయుట

నే పడ గొట్టితిని
కోరికలు నానుండి
రాలిపోయినవి;
శుష్కతర్కవాదములు
నేవిడచి పెట్టితిని –
నీ కటాక్షమొసగు సమయ
మాసన్నమైనది ప్రభూ!
ఓ పాషాణము వంటి నా మనసు
కరగిపోయినది
మరియు నే వాంఛింతునీలో
చేరవలెనని.
నా హృదయము చేరె దాని ఆశ్రయమునకు
పరిపూర్ణ సత్యప్రేమ –
ప్రభూ, నీ కటాక్షమొసగుసమయ మాసన్నమాయె

* * *

చూడుమదె ఆతడరుదెంచెను
ఆతనితో పాతకష్టల తీర్చు కొనవలెను
ఆతడు, అందరి మన్ననలందినవాడు
నన్నలంకరించెనాతడు కల్యాణ పూలమాలతో,
ఆతడు నర్తనము చేయువాడు విశ్వరంగముపై
ఆతడ రుదెంచెను.
ఆతడు బాస చేసె నాకు
ఆతడు తిరిగి నాదరి చేరుదు ననుచు;
ఆతడాలసించెను అతి దీర్ఘకాలము –
నేనచ్చెరువందితిని
ఎవరికితంత్రము లాతని నిలిపినవో,
ఇప్పుడాతడరుదెంచెను

నిలిచెనా తడచట
సిగ్గులేకుండ,
శంఖునూదుచు
నేనాతని కిచ్చినదియె,
పొమ్మ, తలుపు గడియ వేయుము!
నేనాతని విడువను.
నే సహించితిని అపవాదులు, దుష్ప్రచారములు
ఆతనినే నమ్మికొని.
ఇప్పుడాతడు నా ముందు నిలుచు
సిగ్గులేకుండ,
నా కతని కుతంత్రములు తెలియవు
నేనష్టపోతిని చాల –
పొమ్మ, గట్టిగా గడియ వేయుము తలుపుకు
ఆతడు వెడలకుండ
నానిష్కపటమైన వయసులో,
నన్నాతడు గ్రహించె చిరునవ్వుతో,
అటుపిమ్మట నన్నొదిలి వెళ్లెను,
ఇప్పుడాతడు తిరిగి వచ్చెను –
నేనాతనికి కృతజ్ఞతలర్పింతు తిరిగి వచ్చినందుకు –
(ఆతనికతడేసాటి)
నన్నాతడు తిరిగి వదలి పోవడు
పొమ్మ, బంధించుము గట్టిగా తలుపు!
ఈ కలహ మూతనితో
అంతము లేనిదనిపించు
దరిచేర్చునన్ను, ఆదరించుమునన్ను,
నా మిత్రుడా, నీవు కావలె నాకు.

* * *

ఇంకను దయరాదా? ఓ ఈశ్వరా,
ఎంత కఠినాత్ముడవునీవు
విశ్వనర్తకుడవు, సర్వశ్రేయస్సు నందించువాడవు
ఓ ప్రభువు – నా ప్రభువు – నా ప్రభువు,
ఆలకింపుము నా మొర!
నా పసితనముననే నన్నాదుకొంటివి
గొప్పదైవమా – నా దైవమా – నా దైవమా,
ఆలకింపుము నా మొర!
నన్ను క్షమించితివప్పుడు – నీ క్షమను ఇపుడు
నేవేడుచుంటిని – నే వేడుకొంటిని – వే వేడుకొంటిని
ఆలకింపుము నామొర!
నన్ను నేనెరుగ, నీవు నన్ను బాధకు గురిజేసితివి
ఇది న్యాయమా– ఇది న్యామమా – ఇది న్యాయమా,
ఆలకింపుము నా మొర!
నీవనుగ్రహించితివి నన్ను నీవానిగ జేసుకొనుటకప్పుడు
ప్రభువునిత్యుడు – నిత్యుడు – నిత్యుడు
ఆలకింపుము నా మొర!
మాటు ఇచ్చిన వెనుక సహింపదు కాదనుట
ఓ గురువా – నా గురువు – నాగురువు
ఆలకింపుము నా మొర!

* * *

నా దరికి జేరి నన్నాదుకొమ్ము
నాన్నాలింగనము చేసుకొమ్ము, నర్తించుమధురదేవా!
విశ్వము యొక్క ఆత్మవు, నన్ను కౌగలించుకొనుము
సర్వాంతర్యామీ, నన్ను కౌగిలించుకొనుము.
అందరికీ ఆశ్రయుడవు నన్ను కౌగిలించుకొనుము
అందరికీ ప్రభువు నీవు, కౌగలించుకొనుము నన్ను

నానాధుడా, కౌగలించుకొనుమునన్ను
నీవు 'నన్నిచ్ఛగించితివి, నాదరికి చేరుము,
ప్రాప్తినొందిన నీవు, నా దరికి జేరుము,
ఈ ఉప్పొంగు క్షణమున, నా దరికి చేరుము
నన్నెరింగిన నీవు, నా దరికి చేరుము
సరిగా అర్థము చేసికొన్ననీవు, నా దరికి జేరుము
నా కన్నీరు తుడిచిన ప్రభూ నా దరికి జేరుము
నా నాధుడా, నా దరికి జేరుము
నీతోనుండ నిచ్ఛగింతు, ఆలింగనము చేయుము నన్ను
నీ కటాక్షము తెలుసునంతయు, ఆలింగనము చేయుము నన్ను
నీవులేక నేన నాధుడను, ఆలింగనము చేయుము నన్ను
నే ప్రకటింతు నే పరిశుద్ధుడనని, ఆలింగనము చేయుము నన్ను
నా నిండు మనసుతో నిన్ను పిలతు, ఆలింగనము చేయుము నన్ను
నాలో నిలిచియున్న స్వామి, ఆలింగనము చేయుము నన్ను
నానాధుడా, ఆలింగనము చేయుము నన్ను

* * *

Printed at New Printindia Pvt. Ltd. Sahibabad, UP (INDIA)